بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

إِنَّ ٱلدِّينَ عِندَ ٱللَّهِ ٱلْإِسْلَٰمُ

అల్లాహ్ దృష్టిలో అసలు ధర్మం కేవలం ఇస్లాం మాత్రమే

اسلام پر غیر مسلمین کے چند سوالات کے جوابات

# ముస్లిమేతరుల కొన్ని ప్రశ్నలకు జవాబులు

ناشر بہادر


తెలుగు అనువాదకులు :

ఎమ్. జాకీర్ సత్తార్, M.A. M.A. P.G.Dip., PM&IR

బహదూర్

# పరిచయం

సకల చరాచర సృష్టికి మూలధారుడైన అల్లాహ్ సుబ్‌హానహు-తాలాలకే సర్వస్తోత్రములు.

ముస్లిమేతరులైన నా స్నేహితుల నుండి ఇస్లాం గూర్చి వారికి కలిగే ప్రశ్నలు ఎన్నో అడిగేవారు. వారికి సమాధానం ఎప్పటికపుడు చెప్పేవాడ్ని. వారిలో కొందరు అధ్యాత్మిక గ్రంథాల పరిచయం లేనివారు ఉండేవారు. నేను ముస్లిం అని అందుకే ఖుర్‌ఆన్‌ను సమర్థిస్తున్నాని భావించేవారు కొందరు. వారి మనస్సులో ఉన్న ఈ ప్రశ్నలకు ఎలా జవాబు చెప్పాలన్న ఆలోచన నాలో బలంగా నాటుకుపోయింది. అలాంటి సమయంలో డా॥ జాకీర్ నాయక్ గారి ఆన్సర్స్ టు నాన్ ముస్లిమ్స్ - కామన్ క్వశ్చన్స్ ఎబౌట్ ఇస్లాం అను ఆంగ్ల పుస్తకము నేను చూచాను. ఆయనకు ఎదురైన ప్రశ్నలు, ఆయన జవాబు ఇచ్చే విధానం నన్ను ఆకట్టుకుంది. ఎందుకంటే ఆయన అధ్యాత్మిక గ్రంథాల నుండి మరియు శాస్త్రీయ చరిత్ర గ్రంథాలనుండి కూడా ఆధారాలు చూపించారు. పుస్తకం ఆంగ్లంలో ఉండటం వలన తెలుగు పాఠకులకు ఈ విషయాలు తెలియజేయాలన్న ఆలోచన నాలో వచ్చింది. దాన్ని కార్యరూపం దాల్చడం కోసం నా స్నేహితులు నాకు అన్ని విధాలుగా సహకరించారు.

అనువాదం సమయంలో డా॥ జాకీర్ నాయక్ గారి ఇంగ్లీషు పుస్తకంలో కొన్ని మార్పులు చేసాను. ఎందుకంటే తెలుగు పాఠకులకు సులభముగా అర్థమవ్వాలని కొన్ని ఉపమానాలు మార్చి వ్రాసాను.

చివరిగా మహా ప్రవక్త మొహమ్మద్ (స.అ.స.) కాలజ్ఞానం కూడా జతపరచితిని.

ముస్లిమేతరుల యొక్క దృష్టిలో ఇస్లాంపై గల అపోహలు చెడు ఆలోచనలకు దూరం చేయుటకు మా ఈ చిరు ప్రయత్నం. సర్వసాధారణంగా ఈ ప్రశ్నలు తలెత్తుతున్నాయి. కావున వీటి యొక్క జవాబులు ఖుర్‌ఆన్ మరియు ప్రమాణమైన హదీసుల ఆధారంగా సమాధానాలు ఇవ్వడం జరిగింది. ఈ ప్రశ్నల యొక్క జవాబులు చాలామంది ముస్లింలకు కూడా తెలియక పోవడం విచారకం. ఈ పుస్తకము ఇలాంటి వారికి కూడా చాలా ఉపయోగపడుతుంది.

ప్రియ పాఠకులారా!

ఒక్కమాట మాత్రం గుర్తించుకోండి. సర్వ సృష్టికర్త ఏదైనా ఒక ఆజ్ఞను జారి చేసాడంటే దానివల్ల సర్వ మానవులకు మేలు జరుగుతుంది. గాని కీడు ఎట్టి పరిస్థితులలో జరగదన్న విషయం ధృడంగా నమ్మాలి. అలాంటి ఆజ్ఞలను సంపూర్ణం చేయబడిన గ్రంథమే ఖుర్‌ఆన్. వీటిలో ఉన్న విషయములను విజ్ఞానశాస్త్రపరంగా 50% తెలుసుకొనగలిగారు. మిగిలింది కూడా తప్పకుండా తెలుసుకుంటారు.

ముస్లింలు 100% ఖుర్‌ఆన్‌పై నమ్మకం ఉంచుతారు. ఇది దైవగ్రంథం వీటిలో ఎటువంటి సందేహము లేదు. మానవ కల్పిత గ్రంథం కాదు.

ఈ పుస్తకాన్ని ప్రత్యక్షంగాను పరోక్షంగా తోడ్పడిన వారందరిని కృప సంపూర్ణుడైన అల్లాహ్ స్వీకరించి ఇహ పరాలలో గొప్ప సాఫల్యాన్ని ప్రసాదించుగాక! ఆమీన్

ఈ పుస్తకమును ముద్రించదలచినవారు ఈ క్రింది అడ్రస్‌వారిని సంప్రదించవలెను. ఈ పుస్తకము చదవి, గ్రహించి, ఇతరులకు కూడా పంచిపెట్టవలసినదిగా కోరుచున్నాము.

ఇట్లు

బహదుర్

# విషయ సూచిక

**1. ఇస్లాం పురుషునకు నలుగురు స్త్రీలను వివాహం చేసుకునే హక్కు కల్పించడం ఇది పురుష ఆధిపత్యానికి ఒక నిదర్శనం కాదా?**

ఇస్లాంను నిందించే ముందు ఒకే భార్య ఉండాలన్న నిబంధన ఉన్న ఏదైన ఒక మతగ్రంథం చూపించండి. భారతదేశ పురాణాల కథలు చూసినచో (ఉదా: వేదాలు, రామాయణం, మహాభారత్, తాల్‌ముద్, గీతలలో) ఒక భార్య కంటే ఎక్కువమంది భార్యలు ఉన్నవారి సంఖ్యే ఎక్కువ కానవస్తుంది. ఒక భార్య కంటే పెక్కుమంది భార్యలు ఉండటం తప్పు అని ఎక్కడా ఉండదు. ఉదా : దశరద రాజు రాముని యొక్క తండ్రికి ఒకరి కన్న ఎక్కువ భార్యలు. కృష్ణునుకి లెక్కలేనన్ని భార్యలు. బైబిల్‌లో చూసినట్టైతే అబ్రహాంనకు ముగ్గురు భార్యలు, సొలొమానుకు 100 మంది భార్యలు. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉంటాయి....

1954 సం॥లో ఓ హిందూ చట్టాన్ని తెచ్చారు, ఒక భార్య ఉండగా మరో స్త్రీని వివాహ మాడరాదని, చాలామందికి తెలియని విషయం ఏమిటంటే 1400 సం॥లకు పూర్వమే ఒకే భార్య కల్గి ఉండడమే మేలు అని వివరించింది ఇస్లాం. అంతేకాదు ఒకరికంటే ఎక్కువమందిని వివాహమాడితే వారికి (భార్యలకు) సరైన న్యాయం చెయ్యండి అని, అదే విషయాన్ని దివ్య ఖుర్‌ఆన్‌లో చూడండి.

فَانكِحُوا۟ مَا طَابَ لَكُم مِّنَ ٱلنِّسَآءِ مَثْنَىٰ وَثُلَٰثَ وَرُبَٰعَ فَإِنْ خِفْتُمْ أَلَّا تَعْدِلُوا۟
فَوَٰحِدَةً أَوْ مَا مَلَكَتْ أَيْمَٰنُكُمْ ذَٰلِكَ أَدْنَىٰٓ أَلَّا تَعُولُوا۟ ۳

మీకు నచ్చిన స్త్రీలను ఇద్దరేసిగాని ముగ్గురేసిగాని నలుగురేసిగాని వివాహం చేసుకోండి. అయితే వారితో న్యాయంగా వ్యవహరించలేమనే భయం మీకుంటే అప్పుడు ఒకామెనే చేసుకోండి. **(ఖుర్‌ఆన్ 4వ సూర నిసా 3వ వాక్యం)**

وَلَن تَسْتَطِيعُوٓا۟ أَن تَعْدِلُوا۟ بَيْنَ ٱلنِّسَآءِ وَلَوْ حَرَصْتُمْ

ఇదే సూరాలో మరోచోటు ఇలా ఉంది, భార్యల మధ్య పూర్తి న్యాయం చెయ్యటం మీ శక్తికి మించిన పని. మీరు ఎంత కోరినా దీనిని సాధించలేరు. **(ఖుర్‌ఆన్ 4వ సూర నిసా 129వ వాక్యం)**

పై రెండు ఖుర్‌ఆన్ వచనములను బట్టి తెలుస్తున్నది. ఏమిటంటే భార్యలకు సరైన నాయ్యం చెయ్యగల్గినప్పుడే ఒకరి కంటే ఎక్కువమంది అంటే నలుగురు వరకు వివాహం చేసుకునే హక్కు ఉంది. లేకుంటే లేనట్లే కదా. ఒక భార్య కల్గి ఉండటమే మేలు అన్నది కూడా తెలుస్తుంది.

ఇస్లాంను నిందించే ముందు ఇస్లాంకు పూర్వం పరిస్థితి ఎలా ఉండేదో ఒక్కసారి చూడండి. అరబ్బులలో అయితే ఓ పురుషుడు ఎంతమందినైనా వివాహము చేసుకునే హక్కు ఉండెడిది. కొత్త భార్య వస్తే పాత భార్యను నిర్లక్ష్యం

చేసేవారు, లేదా ఆమెను విడిచిపెట్టేవాడు. పురుషుడు ఎన్ని బాధలు పెట్టిన అతని వద్దనే పడి ఉండవలసిందే. ఆమె బాధను చెప్పుకునే అవకాశం కూడా ఉండేది కాదు. అలానే స్త్రీని తన ధన బలంతో, భుజబలంతో వసపరచుకొనేవాడు ఇటువంటి దురాకృత్యాలను ఆపేందుకే ఇస్లాం ఎన్నో ఇటువంటి నియమాలు విధించింది. వివాహం చేయించేటప్పుడు ఖాజీ అంటే (వివాహము జరిపించే పెద్ద) పెళ్ళి కుమార్తెకు ఈ పెళ్ళి నీకు సమ్మతమా లేదా అన్నది ముందు అడుగుతాడు. ఆమెకు సమ్మతమైతేనే వివాహం జరిపిస్తాడు లేదంటే ఆయన వివాహం జరిపించడు. అలానే వివాహం జరిగిన తరువాత ఆమెను భర్త వేధిస్తున్న లేక ఇతర కారణాలవల్ల ఆమె అతని నుండి విడిపోవచ్చు. దీనిని (ఖులా) అందురు.

ఇస్లాం స్త్రీలకు ఎన్నో హక్కులను కల్పించి వారి ఆత్మ గౌరవాన్ని పెంచింది. ఇందులో ఎలాంటి సందేహం లేదు.

ఖుర్‌ఆన్‌లోగల నియమ నిబంధనలు పాటించుటవలన ఎన్నో ప్రయోజనాలు శాస్త్రీయపరంగా కూడా కనిపిస్తాయి. ఒక పురుషునకు నలుగురు స్త్రీల వరకు వివాహమాడే అర్హత కల్గింది అంటే అందులో పరమార్థం ఉంటుంది.

అదేమిటో కొన్నింటిని మీ ముందు ఉంచుతాను చూడండి. వైద్యశాస్త్రం ప్రకారం పురుషుల కంటే మహిళల ఆయుష్షు ఎక్కువ అని కొన్ని సర్వేల వల్ల తెలుస్తుంది. మగ శిశువు కంటే ఆడ శిశువుకే వ్యాధి నిరోధక శక్తి అధికంగా ఉంటుంది. ఆడ శిశువులకన్నా మగ శిశువులే ఎక్కువగా చనిపోతూ ఉంటారు. పెద్దవాళ్ళలో కూడా పురుషులే అధికంగా చనిపోతారు. యాక్సిడెంట్‌ల వలన, యుద్ధాల వలన స్త్రీలకన్న పురుషులే ఎక్కువగా చనిపోతూ ఉంటారు. మన భారతదేశంలో స్త్రీలకన్నా పురుషులే ఎక్కువ. ఎందుకంటే గర్భంలో ఉన్నప్పుడు స్కానింగ్ ద్వారా కడుపులో ఉన్న బిడ్డ ఆడా, మగా అని తెలుసుకొని ఆడబిడ్డ అయితే గర్భంలో చంపేస్తున్నారు (అబార్షన్ ద్వారా) ఇది ఎంత నికృష్టమో ఆలోచించండి.

అమెరికాలో అయితే పురుషుల కంటే స్త్రీలు 7.8 మిలియన్‌ల మంది అధికంగా ఉన్నారు. కేవలం న్యూయార్క్ పట్టణంలో 1 మిలియన్ మంది స్త్రీలు పురుషులకంటే ఎక్కువమంది ఉన్నారని తెలుస్తుంది. ఇక అమెరికాలో ఉన్న పురుషులలో 1/3 వంతు నపుంశకులు ఉన్నారు. మొత్తం అమెరికాలో 2.5 మిలియన్ల మంది నపుంశకులు ఉన్నారు. వీరు ఎలాను వివాహ బంధానికి దూరంగా ఉంటారు.

బ్రిటన్‌లో అయితే పురుషులకంటే స్త్రీలు 4 మిలియన్ మంది అధికంగా ఉన్నారని తెలుస్తుంది. జర్మనీలో 5 మిలియన్‌లు, రష్యాలో 9 మిలియన్‌లు ప్రపంచం మొత్తం మీద ఎంత మంది స్త్రీలు ఉన్నారో అల్లాహ్‌కే తెలియాలి.

ఇలా ప్రపంచంలో ఎక్కడ చూసిన స్త్రీల సంఖ్య ఎక్కువ. ఒక పురుషుడు ఒక్క స్త్రీనే వివాహమాడాలనే నిబంధన ఖచ్చితంగా అమలు చేస్తే మిగిలిని స్త్రీల సంగతి ఏమటి? వివాహ బంధం లేకుండా ఉండిపోవాలా? మరి ప్రకృతి సిద్ధమైన శారీరక వాంఛలు తీరేది ఎలా? వారికి పిల్లలు, సంసారం, కుటుంబం వంటివి

ఎలా ఏర్పడతాయి? మరి వారి వాంఛలు అక్రమ సంబంధాల ద్వారా తీర్చుకోవాలా? ఒక పురుషునకు రెండో భార్యగా ఉండడం గౌరవంగా ఉంటుందా లేక స్త్రీకి, స్త్రీయే చేసుకోవడమా? బజారు పాలు కావడమా? ముస్లింలు చట్టపరంగా ఇద్దరిని వివాహం చేసుకుంటే తప్పు అని అరచిగీపెట్టిన వారు ఈ సమాజంలో పెద్ద మనుషులుగా చెలామణి అయ్యే వారిలో ఎంతమంది అక్రమ సంబంధం పెట్టుకొని చట్ట వ్యతిరేకంగా ఇద్దరేసి, ముగ్గురేసి భార్యలు కల్గి ఉండటం మనం చూడటం లేదా? తన భార్యను మరొకరితో వదలి వేయుట చూచుట లేదా! 1951 నుండి 1961 సం॥లో కమిటీ వారు హిందూ వివాహాలు. ముస్లిం వివాహాలు రెండో పెళ్ళిళ్లపై సర్వే చేసారు. ఆ కమిటీ వ్రాసిన సర్వే రిపోర్టు ప్రకారం చూస్తే ఇద్దరు భార్యలు ఉన్నవారు ముస్లిమేతరులు 5.06% ఉంటే, ముస్లింలు 4.31% మంది ఉన్నట్లు వెల్లడించారు. చివరిగా ఓ మాట, ఇస్లాంలో ఆచరణ పద్ధతులు ఐదు ఉన్నాయి. 1. ఫరజ్ 2. ముస్తహబ్ 3. ముబాహ 4. మక్రు 5. హరామ్

1. ఫరజ్ అంటే తప్పనిసరిగా పాటించాలి లేదా తప్పు చేసినట్లు అవుతుంది.
2. ముస్తహబ్ అంటే ఫలానా పనిచేస్తే పుణ్యం వస్తుంది చెయ్యకుంటే తప్పుకాదు.
3. ముబాహ అంటే ఫలానా పనిచేస్తే పుణ్యం రాదు. పాపం కాదు.
4. మక్రు అంటే ఫలాన పనిచేస్తే తప్పు.
5. హరాం అంటే ఫలాన పని చేయటం వలన మహాపాపం.

ఓ ముస్లిం ఇద్దరు లేక ముగ్గురు భార్యలు కల్గివుండటం ముబాహ క్రింద వస్తుంది. అంటే ఇద్దరు భార్యలు కల్గినవాడు ఉత్తమమైన ముస్లిం అని ఎక్కడ ఉండదు. ముస్లిం సమాజం అతనికి ఎదో గొప్పపని చేసినట్లు పరిగణించదు. ఇస్లాం ఒక స్త్రీ నుండి నలుగురు స్త్రీల వరకు వివాహంచేసే హక్కు కల్పించినా, కొన్ని నియమాలు పెట్టింది. ఆ నియమాలు పాటించే శక్తి ఉన్నవాడే బహు భార్యలు కల్గి ఉండేందుకు అర్హుడు. అవి ఏమిటో మీరు ఖుర్‌ఆన్ వచనములలో చూసారు. భార్యల మధ్య న్యాయం చెయ్యడం మీకు కష్టం అని కూడా చెప్పబడింది.

**2. ఇస్లాం పురుషునకు ఒక భార్య కల్గిఉండగా మరొక స్త్రీని, ఇద్దరినిగాని ముగ్గురిని గాని నల్గురి వరకు వివాహమాడే హక్కు కల్పించింది. మరి అదే హక్కు స్త్రీలకు ఎందుకు కల్పించలేదు?**

జ. ఇస్లాంలో కొన్ని చోట్ల స్త్రీకి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తే కొన్ని చోట్ల పురుషునకు ఇవ్వబడింది. తండ్రి స్థానం గొప్పదా? తల్లి స్థానం గొప్పదా? అంటే తల్లి స్థానం 75% గొప్పది. అయితే తండ్రి స్థానం 25% మాత్రమే. దేవుడు స్త్రీ పురుషుల శరీరాలను వేర్వేరు ఆకారాలుగాను, వేర్వేరు స్వభావాలు కల్గి ఉన్నట్లు సృష్టించాడు. స్త్రీ శరీరం కోమలంగాను (నాజూకు) ఉంటుంది. స్త్రీకి బిడ్డనుకనే అదృష్టం, వారి రొమ్ములలో పిల్లవాడు పుట్టిన తరువాత పుష్టికరమైన పోషక పదార్థాలు కల్గిన పాలను సమకూర్చాడు. పురుషుని శరీరం ధృడంగా, బలంగా ఉండేలా

చేసాడు. అతడు కష్టపడి తన వాళ్ళను పోషించుకోగల్గుతున్నాడు. భార్యా, బిడ్డలను పోషించనివాడ్ని "నువ్వే మగాడివిరా" అని తిడుతూ ఉంటారు. స్త్రీ, పురుషుల ఇద్దరూ సమాన హక్కులు ఉండాలంటే మొదటి పిల్లవాడ్ని నేను కన్నాను కాబట్టి రెండో పిల్లవాడ్ని నీవు నవమాసాలు మోసి కను, అంటే వీలు అవుతుందా? లేదా మొదటి వాడికి నేను పాలు పట్టాను, రెండవ వానికి నీవు పాలు పట్టు అంటే వీలు ఉంటుందా? అలానే పురుషునకు ఒక భార్య కల్గి ఉండగా మరో భార్యతో కూడా కాపురం చెయ్యవచ్చు అదే స్త్రీకి అయితే భర్త ఉండగా మరో భర్తతో కాపురం చేస్తే వివిధ సమస్యలు వస్తాయి. అవి ఏమిటంటే :

ఒక వ్యక్తికి (పురుషునకు) నలుగురు భార్యలు ఉన్న వారికి కల్గిన సంతానానికి తల్లి ఎవరో గుర్తించడం సులువు. అదే స్త్రీకి నలుగురు పురుషులను పెండ్లాడితే ఆమెకు పుట్టిన బిడ్డకు తండ్రి ఎవరో చెప్పడం కష్టం. తండ్రి ఎవరో తెలియని పిల్లలు మానసిక పరిస్థితి అంత బాగుండదని మానసిక వైద్యులు చెబుతుంటారు. అందుకనే వేశ్యలకు పుట్టిన పిల్లలు చాలా వరకు అనారోగ్యంగా వుంటారు. అంతేకాదు ఆమె తన నలుగురు భర్తలకు సరైన న్యాయం చెయ్యలేదు. పైగా శారీరక దుర్బలతలు కూడా వచ్చే అవకాశాలు ఎక్కువ. కాబట్టి స్త్రీకి ఒక భర్త ఉండటమే సముచితం. భర్త చనిపోయినా లేక భర్త విడాకులు ఇచ్చిన కొంతగడువు ముగిసిన తరువాత మరో వివాహం చేసుకునే హక్కు కల్పించింది కేవలం ఇస్లాం మాత్రమే.

وَٱلَّذِينَ يُتَوَفَّوْنَ مِنكُمْ وَيَذَرُونَ أَزْوَٰجًا يَتَرَبَّصْنَ بِأَنفُسِهِنَّ
أَرْبَعَةَ أَشْهُرٍ وَعَشْرًا فَإِذَا بَلَغْنَ أَجَلَهُنَّ فَلَا جُنَاحَ عَلَيْكُمْ
فِيمَا فَعَلْنَ فِىٓ أَنفُسِهِنَّ بِٱلْمَعْرُوفِ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ

మీలో ఎవరైనా మరణించి, వారి భార్యలు సజీవంగా ఉంటే, వారు నాలుగు నెలల పదిరోజుల వరకు తమను తాము నిగ్రహించుకోవాలి. ఈ గడువు (ఇద్దత్) పూర్తి అయిన పిదప వారు తమ కొరకు ఏది ఉచితమో దానిని యుక్తమైన రీతిలో చేసుకోవడానికి స్వేచ్ఛ కలిగియున్నారు. దానికి మీరు బాధ్యులు కారు. మీరు చేసే పనులన్నీ అల్లాహ్‌కు తెలుసు.

**(ఖుర్ఆన్ 2వ సూర బఖర 234వ వాక్యం)**

1400 సం॥ల పూర్వమే ఇస్లాం స్త్రీకి స్వేచ్ఛ ఇచ్చింది. మరే మతంలో ఇలాంటి స్వేచ్ఛ ఇవ్వబడలేదు. మన భారత చరిత్ర చూస్తే సతీసహగమనం ఉండేది. ఇప్పటికి కూడా కొన్ని ప్రాంతాలలో (బీహార్, ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్‌లలో) కొన్ని చోట్ల ఉంది. తన భర్త చనిపోతే మరొక పెళ్ళి చేసుకునే హక్కు లేదా?

**3. ఇస్లాం స్త్రీలను పరదా వెనుకకు నెట్టి వారి స్వేచ్ఛను స్వాతంత్ర్యాలు లేకుండా చేసింది కదా?**

జ. ఇస్లాం స్త్రీలకు స్వేచ్ఛ లేకుండా చేసింది అన్నది నిరాధారమైన ఆరోపణ మాత్రమే. ఇస్లాం గురించి ఇస్లాంకు పూర్వం గురించి తెలియని వారు అన్నమాటలు మాత్రమే. స్త్రీలకు పరదా ఎంతో అవసరం. పరదా వేసుకోవటంలో ముఖ్య ఉద్దేశ్యం ఏమిటో తెలుసుకునే ముందు ఇస్లాంకు ముందు ప్రపంచంలో వివిధ దేశాలలో స్త్రీల పరిస్థితి గురించి తెలుసుకుందాం.

బాబిలోనియా శిక్షాస్మృతులలో పురుషుడు ఎవరినైనా హత్య చేస్తే అతని భార్యకు మరణశిక్ష విధించేవారు. గ్రీకులు అయితే స్త్రీని అంగడిలో బొమ్మలా పురుషులు వాంఛలు తీర్చే వస్తువులా చూసేవారు. కనీసం మనిషిలా కూడా చూసేవారు కాదు. రోమ్ చరిత్ర చూస్తే స్త్రీలను నగ్నంగా చేసి ఆమె అందాలను అంగటిలో పెట్టేవారు. ఈజిప్టులు అయితే స్త్రీలను అపశకునంగా భావించేవారు. అన్ని అనర్థాలకు మూలం స్త్రీయే అంటారు. అరబ్బులు అయితే ఆడ శిశువు పుడితే అవమానంగా భావించేవారు. ఆడపిల్లలను బ్రతికి ఉండగానే పాతి పెట్టెడివారు. ఇక భారతదేశానికి వస్తే భర్త చనిపోతే భర్త శవంతోపాటు భార్యను కూడా తగులబెట్టేవారు. లేదా భర్త చనిపోతే భార్యకు గుండు గీయించి తెల్లచీర కట్టేవారు. సమాజంలో వారికి ఎలాంటి విలువ ఉండేది కాదు. వారిని ఇప్పటికి అపశకునంగా భావిస్తున్నారు.. ఇలాంటి స్త్రీలు ఎదురు రాకూడదని భావిస్తున్నారు. అపశకునంగా భావిస్తున్నారు. ఇస్లాం ఇలాంటి పరిస్థితులలో స్త్రీలకు గౌరవాన్ని ఇచ్చింది. ఎవరికైన ఆడపిల్ల పుడితే ఆమెకు మంచి విద్యాబుద్ధులు నేర్పి, వివాహం చేస్తే అలాంటి తండ్రికి స్వర్గంలో స్థానం పొందుతాడు అని చెప్పింది ఇస్లాం. వివాహ సమయం కాజీ (పెళ్ళి చేయించేవాడు) పెళ్ళి కుమార్తె పెళ్ళి ఆమె సమ్మతం తీసుకున్న తరువాతే పెళ్ళి చేస్తాడు. ఒకవేళ భర్త చనిపోతే కొంత గడువు తరువాత ఆమె మరో వివాహం చేసుకునే అవకాశం కూడా కల్పించింది ఇస్లాం మాత్రమే. భర్త ఆమెను సరిగ్గాచూడని పక్షంలో అతనితో విడాకులు (ఖులా) కోరే హక్కును కూడా ఇస్లాం ఇచ్చింది. మరి ఇస్లాం స్త్రీలకు స్వేచ్ఛ లేకుండా చేసింది అనడంలో అర్థం లేదు.

అసలు పరదా ఎందుకు విధించింది? దాని ముఖ్య ఉద్దేశ్యం ఏమిటి? వాటి విషయాలను ఖుర్‌ఆన్ ద్వారా తెలుసుకుందాం. ఖుర్‌ఆన్ స్త్రీ కన్నా ముందు పురుషులకు ఈ హెచ్చరిక చేసింది.

قُل لِّلْمُؤْمِنِينَ يَغُضُّوا مِنْ أَبْصَٰرِهِمْ وَيَحْفَظُوا فُرُوجَهُمْ
ذَٰلِكَ أَزْكَىٰ لَهُمْ إِنَّ ٱللَّهَ خَبِيرٌۢ بِمَا يَصْنَعُونَ ٣٠

ప్రవక్తా! విశ్వసించిన పురుషులకు తమ చూపులను కాపాడుకొండి అనీ, తమ మర్మాంగాలను రక్షించుకొండి అనీ చెప్పు. ఇది వారికి ఎంతో పరిశుద్ధమైన పద్ధతి. వారు చేసేదానిని గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు.

**(ఖుర్‌ఆన్ 24వ సూర అన్ నూర్ 30వ వాక్యం)**

తరువాత మహిళలను ఉద్దేశించి ఇలా చెప్పబడింది.

وَقُل لِّلْمُؤْمِنَٰتِ
يَغْضُضْنَ مِنْ أَبْصَٰرِهِنَّ وَيَحْفَظْنَ فُرُوجَهُنَّ وَلَا يُبْدِينَ
زِينَتَهُنَّ إِلَّا مَا ظَهَرَ مِنْهَا ۖ وَلْيَضْرِبْنَ بِخُمُرِهِنَّ عَلَىٰ جُيُوبِهِنَّ ۖ
وَلَا يُبْدِينَ زِينَتَهُنَّ إِلَّا لِبُعُولَتِهِنَّ أَوْ ءَابَآئِهِنَّ أَوْ
ءَابَآءِ بُعُولَتِهِنَّ أَوْ أَبْنَآئِهِنَّ أَوْ أَبْنَآءِ بُعُولَتِهِنَّ
أَوْ إِخْوَٰنِهِنَّ أَوْ بَنِىٓ إِخْوَٰنِهِنَّ أَوْ بَنِىٓ أَخَوَٰتِهِنَّ أَوْ نِسَآئِهِنَّ
أَوْ مَا مَلَكَتْ أَيْمَٰنُهُنَّ أَوِ ٱلتَّٰبِعِينَ غَيْرِ أُو۟لِى ٱلْإِرْبَةِ مِنَ
ٱلرِّجَالِ أَوِ ٱلطِّفْلِ ٱلَّذِينَ لَمْ يَظْهَرُوا۟ عَلَىٰ عَوْرَٰتِ ٱلنِّسَآءِ ۖ

ప్రవక్త! విశ్వశించిన మహిళలకు ఇలా చెప్పు, తమ చూపులను కాపాడుకొండి అని, తమ మర్మాంగాలను రక్షించుకొండి అని, తమ అలంకరణను ప్రదర్శించవలదని దానంతట అదే కనిపించేది తప్ప తమ వక్షఃస్థలాలను ఓణి లేక (చీర) అంచులతో కప్పు కోవాలని, వారు తమ అలంకరణను వీరి ముందు తప్ప మరెవరి ముందు ప్రదర్శించకూడదు. భర్త, తండ్రి, భర్తల తండ్రులు, తమ కుమారులు, భర్తల కుమారులు, అన్నదమ్ములు, అన్నదమ్ముల కుమారులు, అక్కా చెల్లెళ్ల కుమారులు తమతో కలిసి మెలసి ఉండే స్త్రీలు, తమ స్త్రీ, పురుష, బానిసలు) వేరే ఏ ఉద్దేశ్యములేని వారి క్రింద పనిచేసే పురుష సేవకులు. స్త్రీల గుప్త విషయాలను గురించి ఇంకా తెలియని బాలురు. తాము గుప్తంగా ఉంచిన తమ అలంకరణ ప్రజలకు తెలిసేలా వారు తమ కాళ్లను నేలపై కొడుతూ నడవరాదని కూడా వారికి చెప్పు......

**(ఖుర్‌ఆన్ 24వ సూర అన్ నూర్ 31వ వాక్యం)**

పరదా చెయ్యడం వలన స్త్రీల గౌరవం పెరుగుతుంది అని ఖుర్‌ఆన్ వివరిస్తుంది.

يَـٰٓأَيُّهَا ٱلنَّبِىُّ قُل لِّأَزْوَٰجِكَ وَبَنَاتِكَ وَنِسَآءِ ٱلْمُؤْمِنِينَ يُدْنِينَ عَلَيْهِنَّ مِن جَلَـٰبِيبِهِنَّ ۚ ذَٰلِكَ أَدْنَىٰٓ أَن يُعْرَفْنَ فَلَا يُؤْذَيْنَ ۗ وَكَانَ ٱللَّهُ غَفُورًا رَّحِيمًا ﴿٥٩﴾

ప్రవక్తా! నీ భార్యలకు, నీ కూతుళ్ళకూ, విశ్వాసుల యొక్క స్త్రీలకు తమ దుప్పట్లు కొంగులను తమపై వ్రేలాడు తీసుకోమని చెప్పు వారు గుర్తింపబడటానికి, వేదింపబడకుండా ఉండేందుకూ ఇది ఎంతో సముచితమైన పద్ధతి. అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను. **(ఖుర్‌ఆన్ 33వ సూర అహ్‌జాబ్ 59వ వాక్యం)**

**(ఖుర్‌ఆన్ 33వ సూర అహ్‌జాబ్ 32-33వ వాక్యం)**

ఇస్లాం చెప్పేది ఏమిటంటే చెడుచేయరాదు, చెడును ప్రేరేపించరాదు అని భోదిస్తుంది. స్త్రీలకే కాదు పురుషులకు కూడా హద్దులు విధించింది. నాభి నుండి ముడుకుల వరకు అందరి ముందు ప్రదర్శించరాదు. పురుషులు అండర్‌వేర్‌లతో తిరగరాదు. లోపలి భాగం కనిపించేవిధంగా వస్త్రాలు ధరించరాదు. అంతేకాదు చెడు నుండి మనస్సును కళ్ళను అదుపులో ఉంచవలెను. మెదడును, చెవులను, నాలుకను రక్షించుకోవాలి. అంటే అసభ్యకరమైన మాటలు: వినుట, అసభ్యకరంగా మాట్లాడుట, ఆలోచించుట చెయ్యరాదు. ఇది పురుషులకు స్త్రీలకు కూడా. పై చెప్పిన ఖుర్‌ఆన్ వాక్యంలో పరదా యొక్క ఉద్దేశ్యాన్ని వివరించింది. గుర్తింపబడటానికి, వేదింపబడకుండా ఉండేందుకు.

ఉదాహరణకు ఇద్దరు అక్కాచెల్లెలు ఉన్నారు అనుకోండి, ఇద్దరు వయస్సులో ఉన్నవారు. వారిలో ఒక ఆమె ఇస్లాం పద్ధతిలో పరదా వేసింది. రెండో అమ్మాయి వెస్ట్రన్ స్టయిల్‌లో మిడ్డీ, టీషర్టు వేసుకుని, ఇద్దరు రోడ్డు మీద వెళుతున్నారు. రోడ్డు ప్రక్కల ఆకతాయి కుర్రాళ్ళు ఉన్నారనుకోండి వారి దృష్టి ఎవరి మీద పడుతుంది? వారు ఏ అమ్మాయిని టీజ్ చేస్తారు?

మరొక ఉదా : కొత్తగా వివాహమైన రెండు కుటుంబాలను తీసుకోండి. ఒక కుటుంబం వారు ఇస్లాం ప్రకారంగా వస్త్రధారణ కల్గినవారు. రెండవ కుటుంబం వీరు ఊహించే టైట్ ఫ్యాంట్, షర్టు లేక మిడ్డీ, జెబ్బల జాకెట్ పూలు ధరించి రోడ్డు మీద వెళుతున్నారు. రోడు ప్రక్కల ఆకతాయి కుర్రాళ్ళు ఉన్నారనుకోండి, వారి దృష్టి ఎవరి మీద పడుతుంది? వారు ఎవరిని టీజ్ చేస్తారు?

ఒక్కసారి ఆలోచించండి. పరాయివాళ్ళు చూచి ఆనందించడానికా స్త్రీలు. ఈలాంటి వస్త్రధారణవల్ల వారి మనస్సులలో వాంఛలు రేకెత్తింపజేయుటకా? మీ అక్క చెల్లెలు, తల్లులు, మీ భార్యలకు మీరు ఇలాంటి స్వేచ్ఛ ఇస్తారా? దీన్ని స్వేచ్ఛ అంటారా? ఒక్కసారి ఆలోచించండి.

స్త్రీకి స్వేచ్ఛ ఇవ్వడం అంటే విచ్చలవిడిగా విడితనాన్ని ప్రోత్సహించడం కాదు. వారికి గౌరవము ఇవ్వాలి. రక్షణ కల్పించాలి. ఆడపిల్లపుడితే మైనస్ పుట్టింది అని భావించే వారు ఎంతో మంది ఉన్నారు. స్త్రీలకు ఎంతో స్వేచ్ఛనిచ్చాం అని చెప్పే అగ్రరాజ్యం అమెరికా. అక్కడ స్త్రీలపై అత్యాచారాలు, హత్యలు సగటున రోజుకు 1900 జరుగుతున్నాయని ఎఫ్‌బిఐ రిపోర్టులో తెలిపింది. 1990లో చేసిన రిపోర్టు సగటున రోజుకి 1,756 మానభంగాలు జరుగుతున్నాయి. 1992-93లో ఈ లెక్క ప్రకారం చూస్తే అమెరికాలో ప్రతి 32 సెకెండ్‌లకు ఓ స్త్రీ మానబంగానికి గురి అవుతుందన్న మాట.

ఇలా జరగడానికి మూలకారణం ఏమిటి? విచ్చలవిడితనం, స్త్రీలు, పురుషులను మానభంగానికి పురిగొల్పే విధంగా వారి వస్త్రాధారణ ఉండటం, మానభంగం చేసేవాడికి కఠినశిక్ష లేకపోడవం. ఇలాంటి స్వేచ్ఛ వలన నష్టపోయేది స్త్రీ సమాజం. స్త్రీలకు స్వేచ్ఛనిచ్చాం అని చెప్పేవారు వారి అందాలను దోచుకుంటున్నారు. అందాల పోటీలు పెట్టి వారి అందచందాలను కొలవటం వారిని అర్ధనగ్నంగా (నగ్నంగా) చేసే వివిధ భంగిమలలో ఫోటోలు తీసి వ్యాపారం చేస్తున్నారు. టీ.విలలో వస్తున్న 10 రూ॥లు సబ్బు అమ్మటానికి, ఆమెను తడిపి ఆమె అంగాన్ని ప్రదర్శిస్తున్నారు. పైగా స్త్రీలకు స్వేచ్ఛ నిచ్చామంటున్నారు. ఇది నిజమా? ఇదేనా స్త్రీలకు ఇచ్చే స్వేచ్ఛ! ఇలాంటి ఆలోచనలు కల్గినవారికి ఇస్లాంను నిందించే హక్కు ఉందంటారా? జ్ఞాన నేత్రాలు తెరచి ఆలోచించండి.

**4. ఒక చేతిలో ఖడ్గం, మరోచేతిలో ఖుర్‌ఆన్ పట్టుకొని ఖుర్‌ఆన్‌ను అనుసరించండి (ఇస్లాంలో చేరండి) లేదా ఖడ్గానికి బలి అవుతారు అని బెదిరించడం వలన ఇస్లాం వ్యాపించింది అంటారు?**

జ. ఇస్లాం అంటే ఏమిటి? ఇస్లాం ప్రచారం ఎలా చెయ్యాలి? అనే విషయాలు ఖుర్‌అన్ ద్వారా తెలుసుకునే ముందు ఇస్లాం వ్యాపించిన దేశాలు గురించి తెలుసుకుందాం.

ముస్లింలు స్పెయిన్ దేశాన్ని 800 సం॥ పాటు పాలించారు. ఆ తరువాత క్రైస్తవులు పాలించారు. క్రైస్తవులు పాలించే కాలంలో ఒక ముస్లిం కూడా బిగ్గరగా అజా (నమాజు కొరకు పిలిచే పిలుపు) ఇచ్చే అవకాశం ఉండేది కాదు. అరబ్బు దేశం అంటే ముస్లిం దేశం అని విడమర్చి చెప్పనవసరం లేదు. అరబ్బు దేశాన్ని మస్లింలు 1400 సం॥ల నుండి పాలిస్తున్నారు. మధ్యలో కొంతకాలం ఫ్రెంచి వారు, బ్రిటీష్‌వారు పాలించినా ఇప్పటికీ అరబ్బు అంతా ముస్లింల ఆధీనంలోనే ఉంది. అరబ్బులో పుట్టుకతోనే (తాతలు, తండ్రుల కాలం నుండి) క్రైస్తవులుగా ఉన్నవారు కనీసం 14 మిలియన్ మంది ఉన్నారు.

భారతదేశానికి వస్తే మన దేశాన్ని ముస్లింలు 1000 సం॥ల పాటు పాలించారు. కాని ఇక్కడ ముస్లింలు 20% మంది మాత్రమే ఉన్నారు. (వారి కాలంలో కొంతమంది రాజులు వారి స్వార్థం కొరకు ఖడ్గాన్ని వాడారన్న దానిలో సందేహం లేదు. ఏవిధంగానైతే ఈ కాలంలో ముస్లింలపై వాడుతున్నారో. ఇండోనేషియా, మలేషియాలో కూడా ముస్లింలు ఉన్నారు. మరి అక్కడ ముస్లింలు పాలించలేదే వారిపై ముస్లింలు దండెత్తలేదే!

తూర్పు ఆఫ్రికా కోస్తా ప్రాంతంలో అయితే ఇస్లాం చాలా తొందరగా వ్యాప్తి చెందింది అక్కడికి కూడా ముస్లింల సైన్యం వెళ్ళలేదే.

ప్రముఖ చరిత్రకారుడు ఒలేసిలియర్ రచించిన "ద ఇస్లాం ఎట్‌ది క్రాస్ రోడ్" అను పుస్తకంలో 48వ పేజీలో ఇలా వ్రాసారు "ఇస్లాం ధన బలంతో గాని భుజబలంతో గాని వ్యాపించలేదు.

రీడర్స్ డైజెస్ట్ అనుమాన పత్రిక 1934 సం॥ నుండి 1984 సం॥ మధ్యకాలంలో వివిధ మతాల వ్యాప్తి చెందిన (వివిధ మతాలలో చేరినవారి) సంఖ్యలను సర్వే చేసి వ్రాసిన రిపోర్టులో ఇలా వివరించారు.

1934 నుండి 1984 మధ్యకాలంలో ఇస్లాం 235% వ్యాప్తి చెందితే క్రైస్తవమతము 47% వ్యాప్తి చెందింది అని వివరించారు.

ఎక్కువ అమెరికా, యూరప్, ఆఫ్రికా దేశాలలోనే ఇస్లాం వేగంగా వ్యాపించింది అని తెలుస్తుంది. మరి వీరందరిని ఎవరు బెదిరించి ఇస్లాం వైపుకు మరలిస్తున్నారు. ముస్లింలు బెదిరించి ఇస్లాంలో చేర్చినట్లైతే అరబ్బుదేశంలో 14 మిలియన్‌ల మంది క్రైస్తవులు వుంటారా? భారతదేశాన్ని ముస్లింలు 1000 సం॥లు పాలించినా 20% మంది మాత్రమే ముస్లింలు ఎందుకు ఉన్నారు. ఇస్లాం అంటే శాంతి సమాధానము. ఇస్లాం ధర్మాన్ని ఆచరింపజేసే విషయంలో ఎలాంటి నిర్బంధము బలత్కారము లేదు అని ఖుర్‌ఆన్ వక్కాణించి చెపుతున్నది.

لَآ إِكْرَاهَ فِي ٱلدِّينِ قَد تَّبَيَّنَ ٱلرُّشْدُ
مِنَ ٱلْغَيِّ فَمَن يَكْفُرْ بِٱلطَّٰغُوتِ وَيُؤْمِنۢ بِٱللَّهِ فَقَدِ
ٱسْتَمْسَكَ بِٱلْعُرْوَةِ ٱلْوُثْقَىٰ لَا ٱنفِصَامَ لَهَا ۗ وَٱللَّهُ سَمِيعٌ عَلِيمٌ ٢٥٦

ధర్మం (ఇస్లాం ధర్మాన్ని ఆచరించే) విషయంలో నిర్బంధం కాని, బలాత్కారం కానీ లేవు. సత్యవాక్కు, అసత్యవాక్కుల నుండి ప్రస్ఫుటం చేయబడింది. ఇకనుండి 'తాగూత్'ను తిరస్కరించి అల్లాహ్‌ను విశ్వసించినవాడు సుస్థిరమైన ఎన్నటికి వీడిపోని ఆశ్రయం పొందినట్లే. (అతడు ఆశ్రయించిన) అల్లాహ్ సర్వము వింటాడు. సమస్థము తెలిసినవాడు. (ఖుర్‌ఆన్ 2వ సూర బఖర 256వ వాక్యం)

ٱدْعُ إِلَىٰ سَبِيلِ رَبِّكَ بِٱلْحِكْمَةِ وَٱلْمَوْعِظَةِ ٱلْحَسَنَةِ وَجَٰدِلْهُم بِٱلَّتِى هِىَ أَحْسَنُ

ప్రవక్తా! నీ ప్రభువు మార్గం (ఇస్లాం) వైపునకు ఆహ్వానించు, వివేకంతో చక్కని హితబోధతో, ప్రజలతో ఉత్తమోత్తమమైన రీతిలో వాదించు

**(ఖుర్ఆన్ 16వ సూర నహ్ల్ 125వ వాక్యం)**

ఇస్లాం గూర్చి ప్రచారం చేసే విధానాన్ని కూడా ఖుర్ఆన్ బోధించింది. దీనిని తూ.చ. తప్పక పాటించువాడే నిజమైన ముస్లిం.

అలా అయితే ముస్లింలు యుద్ధాలు ఎందుకు చేస్తారు అని ప్రశ్నించవచ్చు. పై వచనం తరువాత ఈ విధంగా తెలపడం జరిగింది.

ఒకవేళ మీరు ప్రతీకారం చేస్తే (మీపై దౌర్జన్యం చేసేవారిపై) కేవలం మీపై దౌర్జన్యం జరిగిన మేరకే ప్రతీకారం చెయ్యండి. కాని మీరు సహనం చూపితే అది నిశ్చయంగా సహనం చూపేవారికే మంచిది.

**(ఖుర్ఆన్ 16వ సూర నహ్ల్ 126వ వాక్యం)**

పై వాక్యమును బట్టి తెలుస్తున్నది ఏమిటంటే, ఎవరైనా దౌర్జన్యం చేసినప్పుడు వారిపై తిరగబడడంలో తప్పులేదు. ఇస్లాంను అణగద్రొక్కడానికి ప్రయత్నించినప్పుడు తిరుగుబాటు చెయ్యడంలో తప్పులేదు అన్నది ఇస్లాం బోధన సిద్ధాంతం.

ఎవరో కొందరు రాజ్యాధికార కాంక్షతో యుద్ధాలు చేస్తే అది ఇస్లాంకు సంబంధం లేదు. మరిన్ని వివరాలకు **చూడండి ఖుర్ఆన్ వచనాలు 3, 104. 110.**

**5. చాలామంది ముస్లింలు టెర్రరిజాన్ని ఎందుకు ప్రోత్సహిస్తున్నారు. ఉగ్రవాదులుగా మారుతున్నారు. ఇస్లాం శాంతి బోధిస్తుంటే మరి ఈ హింసా మార్గం వైపునకు ఎందుకు వెళుతున్నారు?**

జ. కొన్ని ప్రచారసాధనాల పుణ్యామా అని ముస్లింలందరిని టెర్రరిస్టులుగా చూస్తున్నారు. ఇది ముస్లింలకు చాలా బాధ కల్గించే విషయం. ఒక విషయం మనం గుర్తించాలి. టెర్రరిజం అనునది ఎలా పుట్టింది. కొందరు పెత్తందార్లు బడుగువర్గాలపైన, పేదవారిపై నిస్సహాయులపై దురాగతాలు చేస్తున్నప్పుడు కొందరు తమ ప్రాణాలను ఫణంగా పెట్టి పెత్తందారులపై తిరగబడ్డారు. వారినే తీవ్రవాదులుగా పేరు పెట్టారు. వీరు పెత్తందారులకు శత్రువులు అయితే నిస్సహాయులకు ఆపద్బాంధవులు (మిత్రులు).

ఏ దేశంలోనైనా ఓ తెగ వారిపై అన్యాయం జరిగితే వారు తిరుగుబాటు చెయ్యడం సహజం. వారిలో కొందరు హింసామార్గాన్ని ఎంచుకుంటే మరికొందరు ఆ హింసను ఆయుధంగా చేసుకుంటారు. కొందరు కలం ద్వారా

తిరుగుబాటు చేస్తే, మరికొందరు తుపాకీ ద్వారా తిరుగుబాటు చేస్తారు. కాని వారి లక్ష్యం ఒక్కటే. భారతదేశంలో కూడా బ్రిటీషు వారి నిరంకుశ పరిపాలనను అంతమొందించడానికి భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు వంటివారు హింసా మార్గాన్ని ఎంచుకున్నారు. వారిని బ్రిటీష్ ప్రభుత్వం తీవ్రవాదులుగా ముద్రవేసింది. కాని వారిని మనం స్వతంత్ర్య సమరయోధులుగా గౌరవిస్తాం.

ముస్లింలు టెర్రెరిస్టులుగా మారుతున్నారు అంటే వారి, వారి స్థానిక సమస్యలు వారిని ఆవిధంగా చేస్తున్నాయి. ఇలాంటి గ్రూపువారు వారి స్థానిక సమస్యలు గురించి పోరాడుతారు. కాని ఇస్లాం వ్యాప్తి చేయడం వారి లక్ష్యం కాదు. అలానే శ్రీలంకలో తమిళ టైగర్లు ఉన్నారు. వారు ఏ మతానికి చెందినవారు? మావోయిస్టులు ఏ మతానికి చెందినవారు? మన ఆంధ్రాలో ఉన్న నక్సలైట్లు ఏ మతానికి చెందినవారు? ఇలా మన దేశంలో అనేక ప్రాంతాలలో ఉన్న తీవ్రవాది గ్రూపులు ఏ మతానికి చెందినవి. కానీ ఇస్లాంను మాత్రమే ఎందుకు నిందిస్తున్నారు. ఇస్లాం ఎప్పుడూ తీవ్రవాదాన్ని ప్రోత్సహించదు. ఈ క్రింది ఖుర్‌ఆన్ (వాక్యాన్ని బట్టి) విశదమగుచున్నది.

مِنْ أَجْلِ ذَٰلِكَ كَتَبْنَا عَلَىٰ بَنِي إِسْرَائِيلَ أَنَّهُ مَن قَتَلَ
نَفْسًا بِغَيْرِ نَفْسٍ أَوْ فَسَادٍ فِي الْأَرْضِ فَكَأَنَّمَا قَتَلَ
النَّاسَ جَمِيعًا وَمَنْ أَحْيَاهَا فَكَأَنَّمَا أَحْيَا النَّاسَ
جَمِيعًا ۚ وَلَقَدْ جَاءَتْهُمْ رُسُلُنَا بِالْبَيِّنَاتِ ثُمَّ إِنَّ كَثِيرًا

ఒక మానవుణ్ణి చంపినవాడు, సమస్త మానవులను చంపినట్లే. ఒక మానవుణ్ణి ప్రాణాన్ని కాపాడినవాడు మొత్తం మానవుల ప్రాణాలను కాపాడినట్లే.

**(ఖుర్‌ఆన్ 5వ సూర మాయిదా 32వ వాక్యం)**

**6. ఇస్లాం శాంతి భోదిస్తుంది అంటారు. మరి జీవహింస చేస్తారు. అంటే మాంసహారము భుజిస్తారు. ఎందుకు?**

ముందుగా ఓ మాట ముస్లిం అయినవాడు తప్పనిసరిగా మాంసహారము తినాలని నిబంధన ఏదీ లేదు. మాంసాహారం తినుట వలన ఎలాంటి తప్పులేదు. వైద్యపరంగా చూసిన మాంసాహారము తినుటవలన శరీరానికి చాలా ప్రయోజనాలు ఉన్నాయి. మాంసాహారములో ప్రోటీన్స్ అధికముగా ఉంటాయి. మన శరీరమును అవసరమైన 8 రకాల ఎయినోయాసిడ్స్ కూడా మాంసాహారము ద్వారా లభిస్తుంది. శాఖాహారం వలన ఎయినోయాసిడ్స్ మన శరీరములో ఉత్పత్తి కాదు అది మనకు మాంసాహారము వలననే లభిస్తుంది. అంతేకాదు ఐరన్, విటమిన్ బి1 మరియు నియోసిన్ మాంసాహారము ద్వారా లభిస్తుంది.

يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا أَوْفُوا بِالْعُقُودِ ۚ أُحِلَّتْ لَكُم بَهِيمَةُ
الْأَنْعَامِ إِلَّا مَا يُتْلَىٰ عَلَيْكُمْ

విశ్వాసులారా! కట్టుబాట్లను పూర్తిగా పాటించండి. మీ కొరకు పశువులను పోలిన జంతువులన్నీ ధర్మసమ్మతం (హలాల్) చేయబడ్డాయి.

**(ఖుర్ఆన్ 5వ సూర మాయిదా 1వ వాక్యం)**

మాంసాహారాన్ని ముస్లింలే కాదు ముస్లింమేతరులు కూడా తింటారు. హిందూ పురాణాల ద్వారా కూడా మాంసాహారము తినుట రుజువు అగుచున్నది. దేవుడు ఈ సృష్టిని మానవుని ఉపయోగం కోసం సృష్టించాడు. దానిని ఎలా వినయోగించుకోవాలి కూడా తెలియజేసాడు. ఈ ఖుర్ఆన్ వాక్యాలను చూడండి.

ఆయన (అల్లాహ్) పశువులను సృష్టించాడు. వాటిలో మీ కొరకు దుస్తులు ఉన్నాయి. ఆహారము ఉన్నది. ఇంకా రకరకాల ఇతర ఉపయోగాలు కూడా ఉన్నాయి. **(ఖుర్ఆన్ 16వ సూర నహల్ 5వ వాక్యం)**

ప్రజలారా! భూమిలోని ధర్మ సమ్మతమైన పరిశుభ్రమైన వాటినన్నింటినీ మీరు తినండి. **(ఖుర్ఆన్ 2వ సూర బఖర 168 వ వాక్యం)**

وَإِنَّ لَكُمْ فِي
الْأَنْعَـٰمِ لَعِبْرَةً نُّسْقِيكُم مِّمَّا فِي بُطُونِهَا وَلَكُمْ فِيهَا مَنَـٰفِعُ كَثِيرَةٌ
وَمِنْهَا تَأْكُلُونَ ﴿٢١﴾ وَعَلَيْهَا وَعَلَى الْفُلْكِ تُحْمَلُونَ ﴿٢٢﴾

నిజంగానే పశువులలో కూడా మీకు ఒక గుణపాఠం ఉంది. వాటి గర్భాలలో ఉన్న దాని నుంచే మేము ఒక వస్తువును (అంటే పాలు) మీకు తాగిస్తున్నాము. మీకు వాటిలో ఇంకా ఎన్నో ఇతర లాభాలు కూడా ఉన్నాయి. వాటిని మీరు తింటారు. వాటిపైనా, పడవలలోనూ ఎక్కుతారు కూడా.

**(ఖుర్ఆన్ 23 సూర అల్‌మూ'మినూన్ 21-22వ వాక్యం)**

పై ఖుర్ఆన్ వాక్యాలను బట్టి కొన్ని రకాల పశువుల ద్వారా మనిషికి జీవనోపాధి కల్గుతుంది. వాటిని మనిషి యొక్క అవసరాల నిమిత్తమే దేవుడు సృష్టించాడు అని తెలుస్తుంది హిందూ పుస్తకాలు : మనుస్మృతి 5,30-31 మరియు 5 లోనే మరొకచోట 5, 39-40

**యజ్ఞార్థం పశవస్సృష్టాః స్వయమేవ స్వయంభువా,**

**యజ్ఞో2స్య భూత్యై సర్వస్య తస్మాద్యజ్ఞే వధోzవధః**

**బ్రహ్మ తానుగానే పశువులను యజ్ఞమునిమిత్తమైసృజించెను. కనుక నీజగత్తుయొక్క మేలుకై యజ్ఞము నిర్మితమైనది. కావున యజ్ఞమునందు పశువధము వధము గాదు. (మనుస్మృతిః - సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము 5 :39, పేజి నెం. 239)**

(మహాభారతంలో అనుశాశన పర్వం భాగం 88 ధర్మరాజు యుదిష్ఠ భీష్ముడు)

సృష్టిలో మాంసాహారము తినే జంతువులు ఉన్నాయి. శాఖహారము తినే జంతువులూ ఉన్నాయి. వాటిని పరిశీలిద్దాం.

శాఖాహారము తినే జంతువుల పళ్ళవరస చూస్తే ఒకే వరుసలో ఉండి కోరపళ్ళు (సూది మొన ఉన్న పళ్ళు) లేకుండా ఉంటాయి. వాటికి నెమరువేసే పళ్ళు మాత్రమే ఉంటాయి.

మాంసాహారము తినే జంతువుల పళ్ళ వరుసను పరిశీలిస్తే వాటి పళ్ళు పదునుగా కోరపళ్ళు సూది మొన ఉన్నపళ్ళు ఉంటాయి.

శాఖాహారము తినే జంతువులకు మాంసాహారము పెడితే అవి జీర్ణించుకోలేవు. మాంసాహారము తినే జంతువులకు శాఖాహారము పెడితే అనారోగ్యం పాలు అవుతాయి.

మనిషి పళ్ళను పరిశీలిస్తే మాంసాన్ని తినగల పళ్ళు, శాఖాహారాన్ని తినగల పళ్ళు ఉన్నాయి. అలానే మనిషి మాంసాన్ని జీర్ణించుకోగలడు. శాఖాహారాన్ని జీర్ణించుకోగలడు. ఎందుకంటే దేవుడు అతని పొట్టను, శరీరాన్ని ఆవిధంగా సృష్టించాడు కాబట్టి.

జీవహింస చేయరాదు అని చెప్పేవారు శాఖాహారము కూడా తినరాదు. చెట్లలో కూడా జీవం ఉంటుందని పరిశోదనలలో తేలింది. అవి కూడ బాధపడతాయని, సంతోషిస్తాయని తెలుస్తుంది. అమెరికాలో ఓ వ్యవసాయ దారుడు చెట్లపై పరిశోధన చేసి వాటికి నీరు అవసరం అయినప్పుడు శబ్దం చేస్తాయని కనుగొన్నాడు. ఎలా అయితే చంటిపిల్లవాడు ఆకలి వేసినప్పుడు పాలకోసం ఏడుస్తాడో, అలానే చెట్లకు నీరు అవసరం అయినప్పుడు ఒక రకమైన శబ్ధం చేస్తాయని ఆయన కనుగొన్నాడు.

పశువుల పాలు తాగుతారు. ఇది శాఖాహారమా లేక మాంసాహారమా?

**7. ముస్లింలు జంతువులను జబా చేసే విధానము. జంతువులను విపరీతమైన బాధకు గురిచేసి వధించినట్లు ఉంటుంది. ఈ విధానం క్రూరంగా వధించడం సమంజసమా?**

జ. ముస్లిం చేసే ప్రతీ పని తన ఇష్టానుసారం చెయ్యడు. ఖుర్‌ఆన్ మరియు ప్రవక్త మహమ్మద్ (స.అ.స.)వారు చెప్పిన విధంగానే చేస్తాడు. చెయ్యాలి కూడా. ఖుర్‌ఆన్ మరియు ప్రవక్తవారి భోధనలలో వివేకంతో దాని వెనుక ఏదో పరమార్థం తప్పక ఉంటుంది. అందులో ఎటువంటి సందేహము లేదు.

అలానే జబా చేసే విధానం చూడటానికి క్రూరంగా కనిపించవచ్చు. కాని ప్రవక్త (స.అ.స.) వారు జంతువుని జబా చేసే విధానం జబా చేయకముందు తీసుకోవలసిన జాగ్రత్తలు వివరించారు. అదేమిటో చూడండి. జబా చేసే కత్తి పదునుగా ఉండాలి. జబా చేసే జంతువు ఎదుట కత్తిని నూర రాదు. ఒక జంతువు ఎదుట మరో జంతువును జబా చెయ్యరాదు. జంతువును పరుండబెట్టిన వెంటనే జబా చేయాలి. (ముస్లిం 5. 209) ఇన్ని విషయాలు మనకు ఏ మత

గ్రంథములలోను కనిపించదు. జంతువు ముందు కత్తి పదును చేస్తే భయంతో బెదిరిపోతుంది. తన ఎదుట మరో జంతువును జబా చేసినచో అది భయంతో వణికిపోతుంది. దాన్ని పరుండబెట్టి ఆలస్యం చేసిన అది కృంగిపోతుంది. పూర్తి ప్రాణం పోకముందే చర్మం వలచిన దానికి బాధ కల్గుతుంది.

ఇన్ని జాగ్రత్తలు చెప్పి జబా చేసే విధానం సగం మెడనే కోయమనడంలో అంతర్యం ఉంటుంది కదా? అదేమిటో తెలుసుకుందాం! మెడ ఒక్కసారిగా నరకడం వలన మెదడుకు వెళ్లే నరాలు తెగిపోయి గుండె కొట్టుకోవడం ఒక్కసారిగా ఆగిపోతుంది. దాని వల్ల రక్తం ఎక్కడిదక్కడే ఉండిపోయి, మాంసంలో ఇంకిపోతుంది. మెడ ఎముక ఒక్కసారిగా విరుగుట వలన అది విపరీతమైన బాధకు గురి అవుతుంది. రక్తం శరీరంలో ఉండిపోవడం వలన మన ఆరోగ్యానికి హాని కల్గిస్తుంది. సూక్ష్మజీవులు రక్తంలో ఉంటాయి. అదే ఇస్లాం పద్ధతిలో జబా చేయుటవలన ఉపయోగం ఏమిటంటే జబా చేసేటప్పుడు కంఠాన్ని రక్తనాళాన్ని కొయ్యాలి. అలా చెయ్యటం వలన కొంత సమయం వరకు గుండె పని చేస్తుంది. దానివల్ల శరీరంలో ఉన్న రక్తం అంతా తెగిన రక్తనాళం గుండా బయటకు వచ్చేస్తుంది. రక్తంతోపాటు సూక్ష్మజీవులు కూడా బయటకు వచ్చేస్తాయి. మాంసం పరిశుభ్రంగా ఉంటుంది.

ఖుర్‌ఆన్ బోధన కూడా చూడండి.

فَكُلُوا۟ مِمَّا رَزَقَكُمُ ٱللَّهُ حَلَٰلًا طَيِّبًا
وَٱشْكُرُوا۟ نِعْمَتَ ٱللَّهِ إِن كُنتُمْ إِيَّاهُ تَعْبُدُونَ ١١٤

ప్రజలారా! అల్లాహ్ మీకు ప్రసాదించిన ధర్మ సమ్మతమైనటువంటి పరిశుభ్రమైనటువంటి ఆహారాన్ని తినండి. అల్లాహ్ చేసిన మేలునకు కృతజ్ఞతలు తెలుపండి, నిజంగా మీరు ఆయననే ఆరాధించే వారైతే.

**(ఖుర్‌ఆన్ 16వ సూర అన్‌నహ్ల 114వ వాక్యం)**

ఇస్లాం పద్ధతి ప్రకారంగా జబా చేసిన జంతువు మాంసం నరికిన జంతువు మాంసం కంటే ఎక్కువ సమయం నిలువ ఉంటుంది. రుచిగా కూడా ఉంటుంది. ఇస్లాం పరిశుభ్రత నేర్పుతుంది.

**8. ఎలాంటి పదార్థాలు తింటే తినేవారి ప్రవర్తన కూడా వాటిలానే ఉంటాయి అని సైన్స్ చెబుతుంది. మరి మాంసాహారము తినుట వలన వారి ఆలోచనా విధానం కూడా మూర్ఖంగా ఉండదా?**

జ. వీటికి నేను ఏకీభవిస్తాను. ఎందుకంటే క్రూర జంతుమాంసం తినుట వలన తినువారి ప్రవర్తన, వారి ఆలోచనలు క్రూరంగా ఉండవచ్చు. తినకపోయిన కొందరి

హృదయాలు కఠినంగా, క్రూరంగా ఉన్నవారు లేరంటారా? వారి స్వార్ధం కోసం, ఎంతోమంది ప్రాణాలను బలితీసుకున్న వారు లేరంటారా?

అయినా, ముస్లింలు సాధు జంతువుల మాంసమే తింటారు. దేని పాలు త్రాగవచ్చో, వాటి మాంసాన్ని మాత్రమే తింటారు. ముస్లిం అనువాడు ఖుర్‌ఆన్ మరియు ప్రవక్త (స.అ.స.) వారు వేటిని అయితే తినుట అనుమతించారో వాటి మాంసాన్నే తింటారు.

يَأْمُرُهُم بِالْمَعْرُوفِ وَيَنْهَاهُمْ عَنِ الْمُنكَرِ وَيُحِلُّ لَهُمُ الطَّيِّبَاتِ وَيُحَرِّمُ عَلَيْهِمُ الْخَبَائِثَ وَيَضَعُ عَنْهُمْ إِصْرَهُمْ وَالْأَغْلَالَ الَّتِي كَانَتْ عَلَيْهِمْ

అతను (ప్రవక్త) వారికి మంచిని ఆజ్ఞాపిస్తాడు. చెడు నుండి నిరోధిస్తాడు. వారి కోసం పరిశుద్ధమైన వస్తువులను, ధర్మసమ్మతం చేస్తాడు. అపరిశుద్ధమైన వాటిని నిషిద్ధం చేస్తాడు. వారిపై మోపబడివున్న బరువులను దించుతాడు. వారు బంధింపబడివున్న శృంఖలాలను తృంచుతాడు. (ఖుర్‌ఆన్ 7వ సూర ఆరాఫ్ 157వ వాక్యం)

ఉదాహరణకు తినుటకు అనుమతించిన కొన్ని జంతువులు మేక, గొర్రె, ఆవు, గేదే, ఎద్దు మొదలైన జంతువులు పక్షులలో కోడి, బాతు, పావురం వంటివి మరికొన్ని పక్షులు. తినుటకు అనుమతించనివి ఉదా : - కొన్ని జంతువులు కోరలు ఉన్న జంతువులు అంటే పిల్లి, పులి, సింహం, నక్క, కుక్క, తోడేలు, ఎలుగుబంటి, ఎలుక, మొసలి మొ॥నవి.

పక్షులలో గ్రద్ద, డేగ, కాకి, గుడ్లగూబ, రాంబందు ఇలాంటి మరికొన్ని పక్షులు. ముస్లింలు తినే జంతువులు క్రూర జంతువులు కాదు. పైగా మనుషులతో కలిసిమెలసి ఉండే సాధు జంతువులు. ఇలాంటి జంతువుల మాంసం తినుట వలన క్రూరంగా ప్రవర్తిస్తారు అనడంలో అర్ధం లేదు.

**9. ముస్లింలు విగ్రహారాధన చెయ్యరు కదా! మరి కాబా వైపు తిరిగి నమాజు ఎందుకు చేస్తారు. దాని చుట్టూ ఎందుకు ప్రదక్షణలు చేస్తారు?**

జ. ముస్లింలు కాబాని దైవ స్వరూపంగా భావించి కాబావైపునకు ముఖము పెట్టి నమాజు చెయ్యరు. కాబాని దిక్కుగా మాత్రమే తలంచి అటువైపు తిరిగి నమాజు చేస్తారు. ఇదే విషయం ఖుర్‌ఆన్‌లో ఉంది.

فَوَلِّ وَجْهَكَ شَطْرَ الْمَسْجِدِ الْحَرَامِ وَحَيْثُ مَا كُنتُمْ فَوَلُّوا وُجُوهَكُمْ شَطْرَهُ

నీవు ముఖాన్ని మస్జిదే హరామ్ (కాబా) వైపునకు త్రిప్పు. ఇకపై మీరెక్కడున్నా సరే, ముఖాన్ని ఆ వైపునకు (కాబా) పెట్టి నమాజు చెయ్యండి.

**(ఖుర్ఆన్ 2వ సూర బఖర 144వ వాక్యం)**

ప్రప్రథమంగా మానవుల కొరకు నిర్మించబడిన ఆరాధన గృహం నిస్సందేహంగా మక్కాలో ఉన్నదే. దానికి సకల శుభాలు ప్రసాదించబడ్డాయి. విశ్వ ప్రజలందరికి అది మార్గదర్శక కేంద్రంగా రూపొందించబడింది. దానిలో స్పష్టమైన సూచనలు ఉన్నాయి. **(ఖుర్ఆన్ 3వ సూర ఆలీ ఇమ్రాన్ 96వ వాక్యం)**

ఇస్లాం అందరిని ఒకే సంఘంలా జీవించమంటుంది. సామూహికంగా నమాజు చదవడం తప్పనిసరి చేసింది. వారి దిక్కు ఒక్కటే చేసింది. ప్రపంచములో ఎక్కడ ఉన్నా ముస్లిం అనువాడు ప్రార్ధన చేయునప్పుడు అతని ముఖం కబా వైపు త్రిప్పుట తప్పని సరి. కాబా ప్రపంచానికే కేంద్ర బిందువై యున్నది.

ప్రముఖ హదీస్ గ్రంథాలలో ఇలా ఉంది. ఒకసారి ఉమర్ (రజి) వారు (ఈయన ప్రవక్త ముహమ్మద్ (స.అ.స.) వారి సహచరులలో ఒకరు) ప్రవక్త వారి తరువాత అబుబకర్ (రజి). ఇస్లాంకు సారధ్యం వహించారు. ఆ తరువాత ఉమర్ (రజి) ఇస్లాం సారధ్య బాధ్యతలు చేపట్టారు. ముహమ్మద్ (స.అ.స.) ప్రవక్త సహచరులలో అగ్రగణ్యులలో ఒకరు ఈయన. కాబా వద్ద నల్లటి రాయి ఉంటుంది. దానిని హజరె అస్వద్ అంటారు. కాబాకి ఎవరు వెళ్ళినా దాన్ని తాకుతారు. ఆ రాయిని ఉమర్ (రజి), వారు తాకుతూ ఇలా అన్నారు. ఓ రాయి నీవు నా దృష్టిలో ఓరాయివి మాత్రమే. నీవు లాభ నష్టాలు చేయలేవు. ప్రియ ప్రవక్త నిన్ను తాకుట నేను చూసాను. అందుకే నేను నిన్ను తాకుతున్నాను అన్నారు.

**(హదీస్, సహిబుఖారి-2 50వ ప్రకరణం హదీస్ నెం. 1594 పేజి. నెం. 599)**

ముస్లింలు పుణ్యక్షేత్రంగా భావించే మక్కాలో శివలింగం ఉందికదా అని అనేవారు మన దేశంలో వున్నారు. ఇది కేవలం స్వర్గం నుండి అదాము వారు తెచ్చిన రాయి పలక మాత్రమే. ఇది దైవం మాత్రం కాదు. శివలింగం అసలే కాదు.

ముస్లింలు మక్కా జయించిన తరువాత మహమ్మద్ (స.అ.స.) వారు కాబాలో ప్రవేశించి హజరత్ బిలాల్ (రజి)గారికి కాబా మసీదు మీదకు ఎక్కి అజాం (నమాజు కొరకు పిలిచే పిలుపు) ఇవ్వమన్నారు. ముస్లింలు కాబాను ఆరాధించినట్లైతే దానిపైకి ఎక్కరు కదా! ఎవరన్న తాము దైవ స్వరూపంగా భావించే వాటిపైకి ఎక్కి తొక్కుతారా? ఒక్కసారి వివేకంతో ఆలోచించండి.

ఇది కేవలం ఇస్లాంపై అవగాహన లేనివారు అన్నమాటలు మాత్రమే.

**చూడండి ఖుర్ఆన్ వచనాలు 2,125, 5,127**

**10. ముస్లిమేతరులను మక్కాలోనికి ఎందుకు అనుమతించరు?**

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِنَّمَا ٱلْمُشْرِكُونَ
نَجَسٌ فَلَا يَقْرَبُوا۟ ٱلْمَسْجِدَ ٱلْحَرَامَ بَعْدَ عَامِهِمْ هَـٰذَا

**(ఖుర్ఆన్ 9వ సూర అత్ తౌబా 28వ వాక్యం)**

జ. ఏ దేశములోనైనా ఇతరులకు ప్రవేశం కల్పించుటకు కొన్ని నిబంధనలు పెడతారు. ఇది సహజం. మన దేశములోనే చూద్దాం. నేవీ, పోర్టు, షిప్‌యార్డు, స్టీల్‌ప్లాంట్ ఇలాంటి సంస్థలోనికి వెళ్ళాలంటే కొన్ని నిబంధనలు ఉంటాయి. ఆ సంస్థ అధికారిచే ధృవీకరణ పత్రం (పాస్) ఉండాలి. అలా కాదని నేను ఈ నగర పౌరుడ్ని నన్ను ఎందుకు అనుమతించరు అంటే ఏమైనా అర్థం ఉందా?

విదేశాలకు వెళ్ళాలంటే వీసా తీసుకోవాలి. వీసా మనకు మంజూరు చేసే ముందు వారు పెట్టిన నిబంధనలకు మనం కట్టుబడి ఉండాలి. అప్పుడు గాని మనకు వీసా (ఆజ్ఞ) మంజూరు చెయ్యరు.

అమెరికాకు వెళ్ళాలంటే చాలా ఎక్కువ నిబంధనలు ఉంటాయి. అంత సులభంగా అమెరికాకు వీసా దొరకదు.

సింగపూర్‌కి వీసా ఇచ్చేముందు వారు పెట్టిన నిబంధనలకు కట్టుబడి ఉంటామని ఓ పత్రంపై సంతకం చెయ్యాలి. ఆ పత్రంలో మొట్టమొదటి నిబంధన ఎటువంటి మాదకద్రవ్యాలతో పట్టుబడినా మరణశిక్ష విధించబడుతుంది అని ఉంటుంది. ఏమిటి దీనికే ఇంత పెద్ద శిక్ష మా దేశంలో అలాలేదే. దానికి మేము సమ్మతించము అంటే కుదురుతుందా?

అలానే మక్కాలోకి వెళ్ళాలంటే ముస్లిం అయి ఉండాలని ఒక నిబంధన. అనగా సర్వసృష్టికర్త ఒక్కడని, మహమ్మద్ (స.అ.స.) దేవుని ప్రవక్తఅని నిబంధనలకు లోబడి జీవితం గడుపుతామని మనఃస్ఫూర్తిగా, వాచ, కర్మ, క్రియలకు లోబడి ఉన్నవారికి మాత్రమే అనుమతి లభిస్తుంది. (లా ఇలాహా ఇల్లల్లా మొహమ్మదుర్ రసూలుల్లాహ)

**11. ఇస్లాం పందిమాంసాన్ని ఎందుకు నిషేధించింది?**

జ. పందిమాంసాన్ని ఖుర్‌ఆన్ మాత్రమే కాదు బైబుల్ కూడా నిషేధించింది. ఇది చాలామంది క్రైస్తవులకు తెలియదు. ముందు ఖుర్‌ఆన్ వాక్యం చూద్దాం.

إِنَّمَا حَرَّمَ عَلَيْكُمُ الْمَيْتَةَ وَالدَّمَ وَلَحْمَ الْخِنزِيرِ وَمَا أُهِلَّ لِغَيْرِ اللَّهِ بِهِ

అల్లాహ్ మీకు నిషిద్ధం చేసినవి ఇవి : దానంతటదే చచ్చిన పశువు రక్తము, పందిమాంసము, అల్లాహ్ తప్ప ఇతరుల పేరు ఉచ్ఛరింపబడిన జంతువు.

**(ఖుర్‌ఆన్ 16వ సూర అన్‌నహ్లా 115వ వాక్యం)**

**చూడండి ఖుర్‌ఆన్ వచనాలు 2,173 5,3 6,147**

బైబుల్‌లోని బుక్ అఫ్ ది లెవిటికస్ (లేవీయకాండం 11:7-8) లో ఇలా ఉంది. పంది విడిగా నుండు రెండు డెక్కలు గలదిగాని అది నెమరువేయదు గనుక అది మీకు అపవిత్రము. వాటి మాంసము మీరు తినకూడదు. వాటి

కళేబరములను ముట్టకూడదు. అవి మీకు అపవిత్రము

మరియు పంది రెండు డెక్కలు గలదైనను నెమరువేయదు గనుక అది మీకు హేయము. వాటి మాంసము తినకూడదు. వాటి కళేబరమును ముట్టకూడదు. (ద్వితీయోపదేశకాండం 14 అధ్యాయము : 8 వచనము)

అదే విధంగా వైద్యశాస్త్రం ప్రకారంగా కూడా పంది మాంసం తినుటవలన 70 రకాల రోగాలు వచ్చే అవకాశం ఉంటుందని తెలుస్తుంది.

మనిషి కడుపులో పెరిగే ప్రాకుడు పురుగులు, చిన్న పురుగులు పందిమాంసంలో ఉంటాయి. ఇలాంటి మాంసాన్ని తింటే అవి శరీరంలోనికి ప్రవేశించి గుడ్లు పెడతాయి. ఆ గ్రుడ్లు రక్తనాళాల ద్వారా మెదడులోనికి ప్రవేశిస్తే మెదడు పాడై పోతుంది. గుండెలోకి ప్రవేశిస్తే గుండె పాడైపోతుంది. కిడ్నీ, లివర్ ఏ భాగంలోనికి ప్రవేశిస్తే ఆ భాగం పాడై పోతుంది. అంతేకాక పందిమాంసంలో క్రొవ్వు అధికంగా ఉంటుంది. పందిమాంసం తినుట వలన రక్తనాళలలో క్రొవ్వు చేరుతుంది. అలా చేరుటవలన రక్తపోటు వస్తుంది. అమెరికా వాసులు అధికశాతం రక్తపోటుతో బాధ పడుతున్నందుకు కారణం పంది మాంసం తినటమే.

పంది అంత అసహ్యకరమైన జంతువు మరొకటి లేదు. అది ఎంత సేపు మురికి గుంటలలోనే ఉంటుంది. మలాన్ని తింటుంది. ఏ మలము దొరక్కపోతే దాని మలాన్ని అదే తింటుంది. పందిలో మరో విచిత్ర గుణం ఉంది. అదేమిటంటే తాను జతకట్టిన ఆడ పంది మీదకి మరో పందిని పంపుతుంది. జతకట్టమని పురిగొల్పుతుంది. ఇలాంటి గుణం మరే జంతువులలో కనబడదు.

అదే గుణం అమెరికా వాసులలో కనిపిస్తుంది. పార్టీలలో డాన్సులు చేస్తూ ఒకరి భార్య మరొకరికి నచ్చినచో ఆ స్త్రీని రమించుటకు తీసుకొని పోవచ్చు. ఆ స్త్రీ యొక్క భర్త మరొక స్త్రీతో రమించినచో ఎటువంటి అభ్యంతరం లేదు. ఇది పాశ్చాత్తుల సంస్కృతి. పందిమాంసాన్ని తినుటవలన ఇలా సంక్రమించి ఉంటుంది.

**12. ఇస్లాం మత్తుపానీయాలను నిషేధించడంలో గల ఉద్దేశ్యం ఏమిటి?**

ఇస్లాం మద్యాన్ని మరియు మత్తు కల్గించే వాటిని కఠినంగా నిషేధించింది.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِنَّمَا ٱلْخَمْرُ وَٱلْمَيْسِرُ وَٱلْأَنصَابُ وَٱلْأَزْلَٰمُ رِجْسٌ
مِّنْ عَمَلِ ٱلشَّيْطَٰنِ فَٱجْتَنِبُوهُ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴿٩٠﴾

విశ్వాసులారా! సారాయి, జూదం, దైవేతర మందిరాలు, పాచికల ద్వారా జోస్యం ఇవన్నీ అసహ్యకరమైన షైతాను పనులు వాటిని విసర్జించండి. మీకు సాఫల్య భాగ్యం కలిగే అవకాశం ఉన్నది. **(ఖుర్ఆన్ 5వ సూర మాయిదా 90వ వాక్యం)**

يَسْـَٔلُونَكَ عَنِ ٱلْخَمْرِ
وَٱلْمَيْسِرِ ۖ قُلْ فِيهِمَآ إِثْمٌ كَبِيرٌ وَمَنَٰفِعُ لِلنَّاسِ وَإِثْمُهُمَآ
أَكْبَرُ مِن نَّفْعِهِمَا ۗ

మద్యపానము గురించీ, జూదము గురించి ప్రజలు నిన్ను ప్రశ్నిస్తారు. నీవు వారికి ఇలా ఉపదేశించు. "ఈ రెంటిలోనూ కీడు ఉన్నది. వాటిలో ప్రజలకు కొన్ని లాభాలు ఉన్నా ఈ లాభాల కంటే కలిగే కీడే ఎక్కువ.

**(ఖుర్ఆన్ 2వ సూర బఖర 219వ వాక్యం)**

మద్యాన్ని ఇస్లాం ఎంతవరకు నిషేదించింది. అంటే మద్యం త్రాగటం, మద్యం అమ్మడం, మద్యం కొని వేరేవారికి ఇవ్వటం, మద్యం రవాణా చెయ్యడం, మద్యం త్రాగేవారికి గ్లాసులో పోసి అందించడం. మద్యం వ్యాపారంలో లెక్కలు వ్రాయండి, అంటే గుమస్తాగా పనిచెయ్యడం, మద్యం తయారుకు వాడే పాత్రలు వాడకం, అంతేకాదు ఒక వ్యక్తికి మద్యాన్ని మోస్తూ ఆ బరువు మోయలేక క్రింద పడిపోతుందన్న భయంతో సహాయం అర్థించిన వాడికి సహాయ పడకూడదు.

మనిషి పతనానికి మొట్టమొదటిది మద్యపానం. మద్యం సేవించిన వాడు విచక్షణ జ్ఞానాన్ని కోల్పోతాడు. అతని ప్రవర్తన వలన పరువు, మర్యాద పోగొట్టుకుంటాడు. అతిగా త్రాగడం వలన తన సొంత ఆడ బిడ్డతో కూడా కామం తీర్చుకున్నాడన్న విషయం మనం పేపర్లలో చూస్తూనే ఉన్నాం. శరీరం కూడా గుల్లవుతుంది. మద్యం త్రాగడాన్ని బైబుల్ కూడా నిషేదించింది. మద్యం ఒక వినాసకర వస్తువు. ఇది కోపాన్ని పెంచుతుంది. సేవించువారు మూర్ఖంగా ప్రవర్తిస్తారు. (బైబిల్ - సామెతలు 20:1, ఎఫెసీయులు 5:18)

నేరాలు చేసేవారిలో 80% మద్యం మైకంలో చేసినవే అని తెలుస్తుంది. హత్యలు గాని, అత్యాచారాలు కాని, వాహనాలు నడుపుతూ యాక్సిడెంట్ కేసులు చూసినా మద్యం మైకంలో ఉన్నవారి సంఖ్య ఎక్కువగా కనబడుతుంది. మద్యం సేవించిన వాడు తాను సుఖపడడూ, తనవాళ్లను, తన చుట్టుప్రక్కల వాళ్లను సుఖంగా ఉండనివ్వడు. మద్యం సేవించడం వలన తాత్కాలిక ప్రయోజనమే ఉంటుంది. దురదృష్టం ఏమిటంటే ఈనాడు మద్యాన్ని సేవించడం ఓ ఫ్యాషన్‌గా మారింది. సంతోషం కల్గితే పార్టీ, బాధ కల్గితే మందు. ఓ పెగ్గు త్రాగితే తప్పులేదు. అనేవారు కొందరు. పార్టీలో త్రాగితే తప్పులేదు అనేవారు మరి కొందరు. కుటుంబ సభ్యులు అందరూ కలసి త్రాగుతూ మోడరన్ కల్చర్ అని చెప్పుకునే బడాబాబులు మరికొందరు. ప్రభుత్వ ఖజానా నింపడం కోసం మద్యాన్ని ప్రభుత్వమే అమ్మడానికి లైసెన్సులు ఇస్తుంది. ప్రజలను చైతన్యపరచాల్సిన పత్రికలు, ఫలానా కంపెనీ వారి మద్యం సేవించండి. ఫలానా కంపెనీ వారి మద్యం సేవించండి అని ప్రకటనలు చేస్తూ, డబ్బు సంపాదిస్తున్నారు.

మద్యం త్రాగటం వలన శరీరంలో చాలా భాగాలు పాడు అవుతాయి. గొంతు క్యాన్సర్, లివర్ క్యాన్సర్ ఊపిరితిత్తులు పాడవుతాయి. మెదడులోని నరాలు పాడైపోతాయి. టి.బి., బి.పి., పచ్చకామెర్లు ఇలా ఎన్నో రకాల రోగాలకు గురి అవుతాడు. ఇస్లాం చట్టం ప్రకారం మద్యాన్ని సేవిస్తే, సేవించిన వాడికి 40 కొరడా దెబ్బలు శిక్షగా వేస్తారు. మద్యపానం ఆధ్యాత్మికత నుండి దూరం చెయ్యడమే కాదు, తను మనిషిననే విషయాన్ని మరచిపోయేలా చేస్తుంది.

హజ్రత్ ఆయిషా (రజి) కథనం ప్రకారం మహా ప్రవక్త (స.అ.స.) వారు ఈవిధంగా ప్రవచించారు. మత్తు కలిగించే ప్రతీ వస్తువు నిషేధం.

**(1 బుఖారి, 4వ ప్రకరణం 11వ అధ్యాయం, హదీస్ నెం. 242 పేజీ నెం. 359)**

హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (స.అ.స.) వారు ఇలా తెలియజేశారు. ఇహ లోకంలో మద్యం సేవించి, ఆ తరువాతైనా పశ్చాత్తాపంతో తనకు తాను సంస్కరించుకోననివాడు పరలోకంలో పరిశుద్ధ మద్యసేవనానికి దూరమైపోతాడు. **(బుఖారి 74వ ప్రకణం 1వ అధ్యాయం పేజి 226)**

**13. సాక్ష్యం చెప్పేటప్పుడు పురుషుడు ఒక్కడి సాక్ష్యానికి బదులు ఇద్దరు స్త్రీలు ఉండాలన్న నిబంధన ఎందుకు? ఇది స్త్రీలను తక్కువ చేసి చూడడం కాదా?**

జ. ఒక పురుషునకు బదులు ఇద్దరు స్త్రీలను సాక్షులుగా తీసుకోవాలన్నది ఖుర్‌ఆన్‌లో ఉన్నది. కాని ఏ సందర్భంలో అన్నది మనం చూడాలి. అర్థికపరమైన లావాదేవీలు అంటే అప్పు ఇచ్చేటప్పుడు, తీసుకునేటప్పుడే ఈ ప్రస్తావన వచ్చింది.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا تَدَايَنتُم بِدَيۡنٍ إِلَىٰٓ أَجَلٖ مُّسَمّٗى
فَٱكۡتُبُوهُۚ وَلۡيَكۡتُب بَّيۡنَكُمۡ كَاتِبُۢ بِٱلۡعَدۡلِۚ وَلَا يَأۡبَ
كَاتِبٌ أَن يَكۡتُبَ كَمَا عَلَّمَهُ ٱللَّهُۚ فَلۡيَكۡتُبۡ وَلۡيُمۡلِلِ
ٱلَّذِي عَلَيۡهِ ٱلۡحَقُّ وَلۡيَتَّقِ ٱللَّهَ رَبَّهُۥ وَلَا يَبۡخَسۡ مِنۡهُ شَيۡـٔٗاۚ
فَإِن كَانَ ٱلَّذِي عَلَيۡهِ ٱلۡحَقُّ سَفِيهًا أَوۡ ضَعِيفًا أَوۡ لَا يَسۡتَطِيعُ
أَن يُمِلَّ هُوَ فَلۡيُمۡلِلۡ وَلِيُّهُۥ بِٱلۡعَدۡلِۚ وَٱسۡتَشۡهِدُواْ شَهِيدَيۡنِ
مِن رِّجَالِكُمۡۖ فَإِن لَّمۡ يَكُونَا رَجُلَيۡنِ فَرَجُلٞ وَٱمۡرَأَتَانِ
مِمَّن تَرۡضَوۡنَ مِنَ ٱلشُّهَدَآءِ أَن تَضِلَّ إِحۡدَىٰهُمَا فَتُذَكِّرَ
إِحۡدَىٰهُمَا ٱلۡأُخۡرَىٰۚ وَلَا يَأۡبَ ٱلشُّهَدَآءُ إِذَا مَا دُعُواْۚ وَلَا تَسۡـَٔمُوٓاْ
أَن تَكۡتُبُوهُ صَغِيرًا أَوۡ كَبِيرًا إِلَىٰٓ أَجَلِهِۦۚ ذَٰلِكُمۡ أَقۡسَطُ
عِندَ ٱللَّهِ وَأَقۡوَمُ لِلشَّهَٰدَةِ وَأَدۡنَىٰٓ أَلَّا تَرۡتَابُوٓاْ

"విశ్వసించిన ప్రజలారా! మీరు పరస్పరం ఒక నిర్ణీత కాలం కొరకు అప్పు తీసుకున్నప్పుడు ఆ వ్యవహారాన్ని వ్రాసి పదిలపరచండి. ఇరుపక్షాల మధ్య న్యాయంగా దస్తావేజును ఒక వ్యక్తి వ్రాయాలి. అల్లాహ్ ఎవడికైతే అక్షరజ్ఞానం ప్రసాదించాడో, అతడు వ్రాయడానికి నిరాకరించకూడదు. అతడు వ్రాయాలి. బాధ్యత మోపబడిన వ్యక్తి (అప్పు తీసుకొనేవాడు) చెప్పి వ్రాయించాలి. అతడు తన ప్రభువైన అల్లాహ్‌కు భయపడాలి. నిర్ణయమైన షరతులలో హెచ్చుతగ్గులు చెయ్యరాదు.

కాని ఋణం తీసుకునే వ్యక్తి అమాయకుడు లేక బలహీనుడు లేక చెప్పి వ్రాయించలేని అసమర్థుడు అయితే అతని సంరక్షకుడు న్యాయంగా చెప్పి వ్రాయించాలి. ఇంకా మీరు మీలోని ఇద్దరు పురుషులను దానికి సాక్షులుగా పెట్టుకోవాలి. ఇద్దరు పురుషులు లభించని పక్షంలో, ఒక పురుషుడు ఇద్దరు స్త్రీలు సాక్షులుగా ఉండాలి. ఎందుకంటే వారిలో ఒకామె మరచిపోతే, రెండవ స్త్రీ ఆమెకు జ్ఞాపకం చేస్తుంది. ఎవరి సాక్ష్యం మీ అందరికి ఆమోదయోగ్యమో వారి నుండే ఈ సాక్ష్యులు ఎన్నుకోబడాలి. సాక్ష్యం ఇవ్వండి అని ఆహ్వానించినప్పుడు, సాక్ష్యులు నిరాకరించకూడదు. వ్యవహారం చిన్నదైనా, పెద్దదైనా దానిని గడువు నిర్ణయంతో దస్తావేజు రూపంలో వ్రాయించటానికి అశ్రద్ధ చెయ్యకూడదు. అల్లాహ్ దృష్టిలో ఈ పద్ధతి మీ కొరకు అత్యంత న్యాయ సమ్మతమైనది. సులభంగా సాక్ష్య నిర్ణయం చెయ్యటానికి ఇది తోడ్పడుతుంది. ఇంకా, మీరు అనుమానాలకు అపోహలకు గురిఅయ్యే అవకాశం తక్కువగా ఉంటుంది.

**(ఖుర్ఆన్ 2వ సూర బఖర 282వ వాక్యం)**

ఇది ఆర్థికపరమైన లావాదేవీ కాబట్టి ఒక పురుషునకు బదులు ఇద్దరు స్త్రీలను ప్రస్తావించబడింది. ఎందుకంటే ఇస్లాం స్త్రీకి గృహిణి స్థానాన్ని కల్పించింది. పురుషునికి ఇంటికి కావాల్సిన సామాగ్రి అందించేవాడిగా నిర్ణయిస్తే, స్త్రీ ఆ ఇంటిని నడిపే బాధ్యతను ఇచ్చింది. ఆర్థికపరమైన లావాదేవీలు పురుషులే ఎక్కువగా చూసుకుంటారు. కాబట్టి, స్త్రీలకు వీటిపై అంతపట్టు ఉండదు. అలానే ఆమె ఇంటి పనులలోపడి మరచిపోవచ్చు.

మనం మన ఇంటిలో వాళ్లను చూస్తే అర్థం చేసుకోవచ్చు. ఓ గృహిణిగా ఉండే స్త్రీ ఉదయం లేచినప్పటి నండి సాయంత్రం పడుకునే వరకు పనిలోనే ఉంటుంది. ఆమెకు శెలవు అనేది ఉండదు. అసలు వాళ్ళు భోజనం చేసారో లేదో అన్న జ్ఞాపకం లేని స్త్రీలు లేకపోలేదు. అందుకనే ఈ వచనములో ఈ ప్రస్తావన తెచ్చింది. ఒక స్త్రీ మర్చిపోతే రెండో ఆమె గుర్తుచేస్తుంది అని. ఖుర్ఆన్‌లో మిగతా చోట్ల సాక్షుల ప్రస్తావన వచ్చినా అక్కడ ఈ నిబంధన రాలేదు. వాటిని కూడా చూద్దాం.

వారి నిర్ణీత గడువు కాలం ముగిసినప్పుడు వారిని ఉత్తమమైన రీతిలో (మీ వివాహ బంధంలో) ఆపి ఉంచండి లేదా ఉత్తమమైన రీతిలో వారి నుంచి విడిపోండి. మీలో న్యాయశీలురైన ఇద్దరు వ్యక్తులను సాక్ష్యులుగా పెట్టుకోండి

(ఓ సాక్షులారా) అల్లాహ్ కొరకు ఉన్నది ఉన్నట్లుగా సాక్ష్యం చెప్పండి. (ఖుర్ఆన్ 65వ సూర తలాఖ్ 2వ వాక్యం) **(ఖుర్ఆన్ 24వ సూర అన్నూర్ 6-10వ వాక్యం)**

ఇది ఇద్దరు భార్యభర్తల మధ్య ఘర్షణలు జరుగుతున్నప్పుడు వారు మొదటి విడాకులు తీసుకుందాం అని నిర్ణయించుకుంటే వారి గడువు ముగిసిన తరువాత విడిపోవాలనుకున్నా కలసి ఉండాలనుకున్నా ఇద్దరు సాక్ష్యుల ముందు ఒక నిర్ణయానికి రావాలి. ఇక్కడ స్త్రీ, పురుషుల భేదాన్ని చూపలేదు.

ఒకవేళ స్త్రీలు తెలివితక్కువ వారు అని ఇస్లాం భావించినట్లైతే మహమ్మద్ ప్రవక్త (సఅ.స.) వారి ప్రవచనాలు ఉల్లేకించిన వారిలో హజరత్ అబూహురైరా (రజి), వారి తరువాత హజరత్ ఆయిషా (రజి) వారి ఉల్లేఖనాలు ఎక్కువ కనిపిస్తాయి. ఒక ముస్లిం ఖుర్ఆన్‌కు ఎంత విలువనిస్తాడో ప్రవక్త ప్రవచనాలను (హదీసుల)ను కూడా అంతే విలువ ఉంటుంది. ఒక స్త్రీ ఉల్లేఖించిన హదీసులు ఎందుకు నమ్మాలి అని కానీ, దానికి మరో పురుషుడు సాక్ష్యంగాని కోరలేదు. మీకు మరో సంఘటన కూడా చూపుతాను. ఒకసారి హజరత్ ఉమర్ (రజి) వారు ప్రవక్త వారి ఉత్తమ సహచరులలో ఒకరు) ఆయన ముస్లింలకు అమీర్‌గా (రాజుగా) ఉన్న కాలంలో ఓ శుక్రవారం జుమా ప్రసంగంలో ఇలా అన్నారు. మహరు (స్త్రీలకు పెళ్లికి ముందు ఇచ్చే రుసుం) ఇంత అని నిర్ణయించారు. అది విన్న ఖౌలా (రజి) అనే స్త్రీ ప్రసంగం మధ్యలో నిలబడి ప్రవక్త వారు ఇంత అని నిర్ణయించలేని దానికి మీరు ఎలా నిర్ణయిస్తారు అని నిలదీసింది. వెంటనే ఉమర్ రజి, వారు ఆయన నిర్ణయాన్ని వెనుకకు తీసుకున్నారు. ఇలాంటి సంఘటనలు ఇస్లాం చరిత్రలో ఎన్నో ఉన్నాయి.

**14. ఇస్లాం పురుషునకు ఆస్తిలో 2 భాగాలు ఇస్తే స్త్రీకి ఒక భాగం ఇవ్వాలని ఎందుకు నిర్ణయించింది? ఇది పురుషుల ఆధిపత్యం కాదా?**

ఇస్లాం ఆస్తిని ఎలా పంచాలి. ఎవరికి ఎంత ఇవ్వాలి, సవివరంగా ఖుర్ఆన్‌లో ఇవ్వబడింది. ఇస్లాం, స్త్రీ పురుషుల వ్యత్యాసం చూడలేదు. చెయ్యలేదు. ఇస్లాం ఆస్తిని పంచే విధానంలో బంధాలను బంధుత్వాలను పరిగణలోనికి తీసుకుంది. మామూలుగా ఒక వ్యక్తి చనిపోతే అతని ఆస్తిని కొడుకులు, కూతుళ్ళు పంచుకుంటారు. కాని ఇస్లాం అతని తల్లిదండ్రులకు, అన్నదమ్ములకు కూడా ఆస్తిలో వాటా కల్పించింది.

ఈ వివరాలను ఖుర్ఆన్ వచనముల ద్వారానే చూద్దాం.

మీలో ఎవరికైనా మరణకాలం సమీపించినప్పుడు, వారి ఆస్తిపాస్తులు కలవారైతే, తమ తల్లిదండ్రులకు, బంధువులకు న్యాయ సమ్మతంగా పంచిపెడుతూ మరణశాసనం విధిగా వ్రాయాలి. ఇది అల్లాహ్ పట్ల భయభక్తులు కలవారి విద్యుక్త ధర్మం. **(ఖుర్ఆన్ 2వ సూర బఖర 180వ వాక్యం)**

يُوصِيكُمُ ٱللَّهُ فِيٓ أَوۡلَٰدِكُمۡۖ لِلذَّكَرِ مِثۡلُ حَظِّ ٱلۡأُنثَيَيۡنِۚ فَإِن كُنَّ نِسَآءٗ فَوۡقَ ٱثۡنَتَيۡنِ فَلَهُنَّ ثُلُثَا مَا تَرَكَۖ وَإِن كَانَتۡ وَٰحِدَةٗ فَلَهَا ٱلنِّصۡفُۚ وَلِأَبَوَيۡهِ لِكُلِّ وَٰحِدٖ مِّنۡهُمَا ٱلسُّدُسُ مِمَّا تَرَكَ إِن كَانَ لَهُۥ وَلَدٞۚ فَإِن لَّمۡ يَكُن لَّهُۥ وَلَدٞ وَوَرِثَهُۥٓ أَبَوَاهُ فَلِأُمِّهِ ٱلثُّلُثُۚ فَإِن كَانَ لَهُۥٓ إِخۡوَةٞ فَلِأُمِّهِ ٱلسُّدُسُۚ مِنۢ بَعۡدِ وَصِيَّةٖ يُوصِي بِهَآ أَوۡ دَيۡنٍۗ

మీ సంతానం విషయంలో అల్లాహ్ మీకు ఇలా ఆదేశిస్తున్నాడు. ఒక పురుషుని భాగం ఇద్దరు స్త్రీల భాగాలకు సమానం. ఒకవేళ (మృతునికి వారసులుగా) ఇద్దరి కంటే ఎక్కువమంది ఆడపిల్లలు ఉంటే వారికి మొత్తం ఆస్థిలో మూడింట రెండు భాగాలు ఇవ్వాలి. ఒకే ఆడపిల్ల వారసురాలైతే, ఆస్థిలో అర్ధభాగం ఆమెకు చెందుతుంది. మృతుడు సంతానం కలవాడైతే అతని తల్లిదండ్రులలో ఒక్కొక్కరికి మొత్తం ఆస్థిలో ఆరోభాగం లభించాలి. ఒకవేళ అతడు సంతానం లేనివాడై అతని తల్లిదండ్రులు మాత్రమే అతనికి వారసులైతే అప్పుడు తల్లికి మూడో భాగం ఇవ్వాలి. మృతుడికి సోదరీ, సోదరులు కూడా ఉంటే అప్పుడు తల్లికి ఆరోభాగం లభిస్తుంది. మృతుడు వ్రాసిన వీలునామా అమలుజరిపి అతనిపై ఉన్న అప్పులు తీర్చిన తరువాతనే (ఈ భాగాల పంపకం జరగాలి)

**(ఖుర్ఆన్ 4వ సూర నిసా 11వ వాక్యం)**

పై ఖుర్ఆన్ వచనముల బట్టి తెలుస్తున్నది ఏమిటంటే ఖుర్ఆన్ స్త్రీ పురుషులు భేదాన్ని బట్టి కాదు వారి బంధుత్వాన్ని బట్టి ఆస్తిలో హక్కును కల్పించింది. ఒక తల్లికి మూడో భాగాం కల్పిస్తే తండ్రికి ఆరోభాగం కల్పించబడింది. ఇక్కడ స్త్రీకి ఎక్కువ ఇవ్వబడింది.

అన్నచెల్లిళ్ళ మధ్య అన్నకు ఒక భాగం. చెల్లెళ్ళకు అర్థ భాగం ఇవ్వాలని ఉంది. అంటే కుమారునికి ఇద్దరు కుమార్తెల భాగం ఇవ్వవలసిందిగా చెప్పడం జరిగింది. ఇలా ఎందుకు నిర్ణయించబడిందని ఆలోచిస్తే తెలుస్తుంది. ఆస్తిలేని తండ్రి చనిపోయాడనుకోండి, ఆ ఇంటి బాధ్యత అ ఇంటి మగ దిక్కు తీసుకోవలసి ఉంటుంది. తన చెల్లెలి వివాహం కూడా ఆయనే జరిపించవలసిన భాద్యత ఆయనపైనే ఉంటుంది. అదే స్థానం స్త్రీ అక్క స్థానంలో ఉండి పురుషుడు తమ్ముడు స్థానంలో ఉంటే ఆమె వివాహం చేసుకొని వేరే ఇంటికి వెళ్ళిపోతుంది. తమ్ముని భాధ్యత తల్లి భరించాలి. బాధ్యతలు భరించేవాడికి అధికంగా హక్కు కల్పించడంలో తప్పులేదు కదా? ఇస్లాం ఎవరికి అన్యాయం చెయ్యదు. ఇది సత్యం. ఇస్లాం వ్యతిరేకంగా ఎవరైనా ప్రవర్తిస్తే అది ఇస్లాం తప్పుకాదు. (చూడండి ఖుర్ఆన్ వచనం 4.7)

**15. మరణాంతర జీవితం ఉందని ఎలా నిరూపించగలరు?**

జ. మరణాంతర జీవితం ఉంటుందని ఖచ్చితంగా చెప్పగలము. ఎలా అంటే ఖుర్‌ఆన్‌లో ఉంది కాబట్టి ఖుర్‌ఆన్ చెప్పిన విషయాలు సైన్సుపరంగా 80% కంటే అధికంగా రుజువయ్యాయి. 1400 సం॥ పూర్వం చదవడం, వ్రాయడం రాని ఆయన ఎలాంటి పరిశోధనలు చెయ్యకుండా చెప్పిన మాటలు ఈరోజు రుజువు అవుతున్నాయి. ఉదా : ప్రళయదినం దగ్గర పడినప్పుడు భూమిని దగ్గర చేయబడుతుంది అన్నారు. ఇది నిజం కాలేదా! ఆ రోజులలో నెలలు తరబడి ప్రయాణం చెయ్యవలసిన దూరాన్ని ఈరోజు గంటలలో చేరుకుంటున్నారు. వేల మైళ్ళ దూరంలో ఉన్నవారి నుండి సమాచారాన్ని క్షణాల మీద పొందుతున్నాము.

ప్రతి ఇంటిలో గాన, భజనా కచేరీలు జరుగుతాయి అన్నారు. ఆ రోజులలో విన్నవారు ఆశ్చర్యపోయారు. ఈ రోజు టి.వీల ద్వారా రుజువు అయ్యాయి. ఇలా చెప్పుకుంటూపోతే చాలా ఉన్నాయి. ఇప్పుడు ఖుర్‌ఆన్‌లోని కొన్ని వచనములు చూద్దాం.

وَالزُّبُرِ وَالْكِتَابِ الْمُنِيرِ ﴿١٨٤﴾ كُلُّ نَفْسٍ ذَائِقَةُ الْمَوْتِ
وَإِنَّمَا تُوَفَّوْنَ أُجُورَكُمْ يَوْمَ الْقِيَامَةِ فَمَن زُحْزِحَ
عَنِ النَّارِ وَأُدْخِلَ الْجَنَّةَ فَقَدْ فَازَ وَمَا الْحَيَاةُ الدُّنْيَا
إِلَّا مَتَاعُ الْغُرُورِ ﴿١٨٥﴾

చివరకు ప్రతి మనిషి మరణిస్తాడు. మీరంతా మీ పూర్తి ప్రతిఫలాన్ని, ప్రళయంనాడు పొందుతారు. అక్కడ నరకాగ్ని నుండి కాపాడబడి, స్వర్గంలో ప్రవేశపెట్టబడేవాడు మాత్రమే యధార్థానికి సఫలీకృతుడు. ఇక ఈ ప్రపంచం, అది కేవలం మాయా వస్తువు మాత్రమే.

**(ఖుర్‌ఆన్ 3వ సూర ఆలి ఇమ్రాన్ 185వ వాక్యం)**

إِنَّ اللَّهَ لَا يَظْلِمُ
مِثْقَالَ ذَرَّةٍ وَإِن تَكُ حَسَنَةً يُضَاعِفْهَا وَيُؤْتِ مِن لَّدُنْهُ
أَجْرًا عَظِيمًا ﴿٤٠﴾

అల్లాహ్ ఎవరికి రవ్వంత అన్యాయం కూడా చెయ్యడు. ఎవరైనా ఒక మంచి పనిచేస్తే దాన్ని అల్లాహ్ రెండింతులు చేస్తాడు. ఇంకా తన తరపు నుండి పెద్ద ప్రతిఫలం కూడా ప్రసాదిస్తాడు (ఖుర్‌ఆన్ 4వ సూర నిసా 40వ వాక్యం)

ఈ ఆయత్ (వాక్యా)లను నిరాకరించిన వారిని మేము నిశ్చయంగా అగ్నిలో పడవేస్తాము. ఇంకా వారి శరీర చర్మం కాలి కరిగిపోయినప్పుడల్లా, దాని స్థానంలో

మేము మరొక చర్మాన్ని సృష్టిస్తాము. వారు శిక్షను బాగా రుచి చూడాలని, అల్లాహ్ సర్వశక్తిమంతుడు. తన నిర్ణయాలను అమలుపరచే విజ్ఞత ఆయనకు నిండుగా ఉంది. (ఖుర్‌ఆన్ 4వ సూర నిసా 56వ వాక్యం)

ٱلَّذِى خَلَقَ ٱلْمَوْتَ وَٱلْحَيَوٰةَ لِيَبْلُوَكُمْ أَيُّكُمْ أَحْسَنُ عَمَلًا ۚ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْغَفُورُ ۝٢

మీలో మంచి పనులు చేసేవారెవరో పరీక్షించి చూద్దామని ఆయన చావు బ్రతుకులను సృష్టించాడు. ఆయన అత్యంత శక్తి సంపన్నుడు. అత్యధికంగా మన్నించేవాడునూ. (ఖుర్‌ఆన్ 67వ సూర అల్‌ముల్క్ 2వ వాక్యం)

ఇటువంటి వచనాలు ఖుర్‌ఆన్‌లో చాలా ఉన్నాయి.

మరణాంతర జీవితం లేకుంటే పాపం పుణ్యం అనే మాటలకు అర్థం ఉండదు. ఇప్పటివరకు ఖుర్‌ఆన్ చెప్పిన విషయాలు 80% పైగా రుజువైనాయి. ఇంకా 20%లో మరణాంతర జీవితం, ప్రళయం, స్వర్గం, నరకం వంటివి. మనిషి తన కంటికి కనిపించే భూమి గురించి గాని విశ్వం గురించి గాని ఇంకా పూర్తిగా తెలుసుకోలేదు. సముద్రజలాల్లో ఉన్న ప్రాణుల వివరాలు ఇంకా మనిషికి అంతుపట్టలేదు. ఇలాంటి అంతుపట్టని విషయాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో మరణాంతర జీవితం ఒకటి.

ఏ ప్రాణిపైనా అల్లాహ్ దాని శక్తి సామర్థ్యాలకు మించిన బరువు బాధ్యతలను మోపడు. తాను సంపాదించిన పుణ్యానికి సత్ఫలితాన్నీ, తాను కూడబెట్టిన పాపానికి దుష్ఫలితాన్నీ ప్రతీ వ్యక్తి అనుభవిస్తాడు. (ఖుర్‌ఆన్ 2వ సూర బఖర 286వ వాక్యం)

చేసిన పాపం ఊరకే పోదు అంటారు. చేసిన దానికి ప్రతిఫలం అనుభవిస్తావు అంటారు. ఇవి అన్నీ జరుగుతాయి. తీర్పు దినం ఎప్పుడు, ఎక్కడ అన్న ప్రశ్నకు సమాధానమే మరణాంతర జీవితం. ఎంతోమంది అమాయకుల ప్రాణాలతో చెలగాటం ఆడేవాళ్ళు ఉన్నారు. వారి శిక్ష ఏమిటి. హిట్లర్ 6 కోట్ల మంది యూదులను చంపించాడు. అతనికి శిక్ష ఏమిటి? ఒక వ్యక్తిని చంపితే మరణశిక్ష వేస్తారు. 6 కోట్ల మందిని చంపిన వాడికి ఏమి శిక్ష? దేవుని నమ్మడం అంటే ఆయనను ఆరాధిస్తే డబ్బు లభిస్తుంది. సుఖ సంతోషాలు వస్తాయి. అనారోగ్యం నుండి దూరంగా ఉంటాము అని నమ్మకం ఉంచడం కాదు. దేవుడు ఉన్నాడు ఆయన మనలను గమనిస్తున్నాడు. తప్పుచేస్తే శిక్షిస్తాడు. మంచిచేస్తే దాని ఫలితాన్ని ఇస్తాడు అని నమ్మడమే నిజమైన భక్తి. జీవితాంతం దుర్మార్గాలు చేసిన వాడు ఇహలోకంలో దర్జాగా బ్రతుకుతున్నాడు. కేవలం మరణమే అతని శిక్ష. మరి జీవితాంతం మంచి చేస్తూ అష్ట కష్టాలు పడతారు. వారికి ప్రతిఫలం ఎక్కడ? దేవుడు ఎవరికి అన్యాయం చెయ్యను అంటున్నాడు. మంచి చేసేవారికి, చెడు చేసేవారికి పూర్తి న్యాయం జరిగేది మరణాంత జీవితంలోనే

చూడండి ఖుర్‌ఆన్ వచనాలు 2, 258 17,49-52 35,9 36,51-52

**16. ఇస్లాంలో అనేక వర్గాలుగా ఉండటానికి కారణం ఏమిటి?**

జ. ఇస్లాంలో అనేక వర్గాలుగా ఏర్పడడానికి అనేక కారణాలు చెప్పవచ్చు. అధికార వ్యామోహాలు, వంచకుల ఎత్తుగడలు, ఇస్లాంపై పూర్తి అవగాహన లేకపోవడం, ఇలా చాలా కారణాలు చెప్పవచ్చు. కాని ఖుర్ఆన్ మాత్రం అందరూ కలసి కట్టుగా ఉండమని బోధిస్తుంది.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱتَّقُوا۟ ٱللَّهَ حَقَّ تُقَاتِهِۦ وَلَا تَمُوتُنَّ إِلَّا وَأَنتُم
مُّسْلِمُونَ ﴿١٠٢﴾ وَٱعْتَصِمُوا۟ بِحَبْلِ ٱللَّهِ جَمِيعًا وَلَا تَفَرَّقُوا۟

విశ్వసించిన ప్రజాలారా! అల్లాహ్‌కు ఏవిధంగా భయపడాలో, ఆవిధంగా భయపడండి. ముస్లింలుగా తప్ప మీరు మరణించకండి. అంతా కలసి అల్లాహ్ త్రాడును గట్టిగా పట్టుకోండి. విబేధాలలో పడకండి.

(ఖుర్ఆన్ 3వ సూర అలి ఇమ్రాన్ 102వ వాక్యం)

అందరూ కలిసికట్టుగా అల్లాహ్ త్రాడు అంటే అల్లాహ్ చూపిన ధర్మాన్ని కలసికట్టుగా పట్టుకోండి. ఇస్లాం ధర్మంపై నడవమని బోధిస్తుంది.

ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు: "మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి, అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడు. అనన్యంగా కరుణించేవాడునూ". వారితో ఇంకా అల్లాహ్‌కూ, ప్రవక్తకూ విధేయత చూపండి" అని అను. ఒకవేళ వారు నీ ఈ సందేశాన్ని స్వీకరించపోతే, అల్లాహ్ తనకు, తన ప్రవక్తకూ విధేయత చూపటానికి నిరాకరించిన వారిని ప్రేమించటం అనేది నిశ్చయంగా జరగదు.

(ఖుర్ఆన్ 3వ సూర అలి ఇమ్రాన్ 31-32వ వాక్యం)

وَأَطِيعُوا۟ ٱللَّهَ وَٱلرَّسُولَ لَعَلَّكُمْ تُرْحَمُونَ ﴿١٣٢﴾

అల్లాహ్‌కు ప్రవక్తకూ విధేయత చూపండి. మీరు కరుణింపబడే అవకాశం ఉంది. (ఖుర్ఆన్ 3వ సూర అలి ఇమ్రాన్ 132వ వాక్యం)

ప్రతీ ముస్లిం అల్లాహ్ మరియు ప్రవక్త మహమ్మద్ (స.అ.స.) వారు చూపిన బాటలో నడవాలి లేదంటే ఇస్లాం నుండి దూరంగా వెళ్ళిపోయినట్లే అవుతుంది. ఇస్లాంలో ఎన్ని వర్గాలు ఉన్నా ఖుర్ఆన్‌ను మరియు ప్రవక్త ప్రవచనాలను (హదీసులను) తూ.చ. తప్పకుండా అనుసరించువాడే నిజమైన ముస్లిం. జామాతుల్ ముస్లిమీన్ అని పేరు పెట్టుకున్నంత మాత్రాన ముస్లింలు కారు. ముస్లిం ఇంట జన్మించినంత మాత్రాన అతడు నిజమైన ముస్లిం కాలేడు. అల్లాహ్ వారి పేరును బట్టి స్వర్గాన్ని, నరకాన్ని నిర్ణయించడు. వాడు చేసే కర్మల ఆధారంగానే వాడికి ప్రతిఫలాన్ని ఇస్తాడు.

ఇస్లాంలో ఎన్ని వర్గాలు ఉన్న ఖుర్‌ఆన్ మరియు హదీసు గ్రంధాలలో చెప్పబడిన విధంగా నడుచువాడే నిజమైన ముస్లిం, నిజమైన ముస్లిం కావాలంటే ఖుర్‌ఆన్, హదీసుల గురించి ప్రతి ముస్లిం తెలుసుకోవాలి. వాటిలో చూపిన ప్రకారంగా నడుచుకోవాలి. అప్పుడే అతడు దేవుని దృష్టిలో ముస్లిం అనిపించుకుంటాడు.

**చూడండి ఖుర్‌ఆన్ వచనాలు 3,31. 4,61. 65. 69. 47,33 33,21**

**17. అన్ని మతాలు మంచినే బోధిస్తాయి కదా మరి అలాంటప్పుటడు ఇస్లాంనే ఎందుకు స్వీకరించాలి?**

అవును నిజమే అన్ని మతాలు మంచినే భోధిస్తాయి. కాని ఇస్లాం ఒక వర్గానికి, ఒక దేశానికి, ఒక ప్రాంతానికి సంబంధించిన మతం కాదు. ఇస్లాంలో ఎక్కడ మూఢత్వం, అంద విశ్వాసం ఉండదు. సృష్టిని పూజించకూడదని సృష్టికర్తనే ఆరాధించాలి అని ఎలుగెత్తి చాటడమే కాదు. తన చిత్రపటము కూడా ఎక్కడా లేకుండా చేసారు మహమ్మద్ ప్రవక్త (స.అ.స.) వారు. అంతేకాదు మనిషి పుట్టినప్పటి నుండి చనిపోయేవరకు ఎలా ఉండాలో ఆచరించి చూపించారు ప్రవక్తవారు. భక్తి అంటే దేవుడిని నమస్కరించడం కాదు. నిజమైన భక్తి అంటే కనిపించని దేవుడు మనల్ని చూస్తున్నాడని అతడికి భయపడాలని అది ఎలా భయపడాలో కూడా తెలియజేసింది ఇస్లాం. పిల్లవాడు పుడితే ఎన్ని రోజులలో పేరు పెట్టాలి. ఎన్ని సం॥లు తల్లిపాలు పట్టాలి.

పెళ్ళి ఎవరితో చెయ్యాలి. పెళ్ళి ఎవరితో చెయ్యకూడదు. తల్లి బాధ్యత ఏమిటి, తల్లిని ఎలా గౌరవించాలి. తండ్రి స్థానం ఏమిటి? ఒంటికి, రెండికి వెళ్ళినప్పుడు ఎలా కూర్చోవాలి. స్త్రీల సమస్యలు వారి పరిష్కారాలు? చివరికి చెప్పులు వేసుకునే విధానం కూడా నేర్పుతుంది. దురదృష్టం ఏమిటంటే ఇప్పటి ముస్లింలకు చాలా మందికి ఈ విషయాలు తెలియవు.

జీవన విధానం క్లుప్తంగా తెలిపినది కేవలం ఇస్లాం ధర్మం మాత్రమే. మంచి చెడులను తెలియజెయ్యడమే కాదు, చెడును నిర్మూలించే విధానం కూడా ఇస్లాం సూచించింది.

ఉదా:- దొంగతనం చెయ్యడం తప్పు అని చెప్పింది. అంతేకాదు దొంగతనం చేసినవాడి చేతులు నరకమని అజ్ఞాపించింది. ఆ మొండి చేతులలో మరోసారి ఆ పని చెయ్యడని వాడ్ని చూసి మరోకడు అలాంటి సాహసం చెయ్యడని. ఇది కఠినంగా కనిపించినా ఇది చక్కటి పరిష్కారం చూపింది. అంతేకాదు దొంగతానినికి కారణం బీదరికం. దీన్ని రూపుమాపాలని జకాత్ విధి దానం చెయ్యాలని డబ్బున్నవాడు 85 గ్రాముల బంగారం కంటే అధికంగా ఉన్నవాడు జకాత్ ఇవ్వాలి అని సూచించింది. బంగారం విలువలో 100కి 2.50పై బీదలకు

ఇవ్వాలి. బంగారమే కాదు, ఆ విలువ చేసే డబ్బు, ఆదాయం వచ్చే భూములు, వ్యాపారాలు మీద కూడా జకాత్ ఇవ్వాలి. ఇలా ప్రతివారు చేస్తే దొంగతనం రూపుమాసిపోదంటారా!

చాలామంది అంటారు ఇస్లాంలో శిక్షలు చాలా కౄరంగా ఉంటాయి అని. ఇలాంటి కఠిన శిక్షలు లేకపోవడం వలనే దొంగతనాలు, మోసాలు యదేచ్ఛగా జరుగుతున్నాయి. మనం సంపాదించిన డబ్బు బ్యాంకులలో దాచుకున్నా రక్షణ లేకుండా పోతుంది. దాన్ని బ్యాంకు అధికారులే మెక్కుతున్నారు. వారిపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలంటే వీలే లేకుండా పోతుంది. అంతే కాకుండా వారు మనముందే బడాబాబులుగా తిరుగుతున్నారు. తన అమ్మాయి పెళ్ళికోసం దాచుకున్న సొమ్మును ఎవరైనా మోసం చేసి కాజేసారనుకోండి, ఆ తండ్రి పరిస్థితి ఏమిటి అతని ముందు ఆ మోసగాడు ఎదురుపడితే ఏం చేస్తాడు.

అలానే మానభంగం చేసేవారికి ఇస్లాం మరణశిక్ష విధిస్తుంది. అంతేకాదు పురుషులను ఇలాంటి తప్పుడు ఆలోచనలు కల్గకుండా ఉండేందుకు పరదా పద్ధతి పెట్టింది. అలానే పురుషులను కూడా చెడు చూపులను, ఆలోచనలనుండి మనుస్సు మరల్చుకోమని చెప్పింది. ఈ ఖుర్ఆన్ వాక్యములను చూడండి.

ప్రవక్త! విశ్వసించిన పురుషులకు తమ చూపులను కాపాడుకోండి అని తమ మర్మాంగాలను రక్షించుకోండి అని చెప్పు. ఇది వారికి ఎంతో పరిశుద్ధమైన పద్ధతి. వారు చేసే దానిని గురించి అల్లాహ్‌కు బాగా తెలుసు (24:30)

చూపులను కాపాడుకోవడం అంటే స్త్రీని చూచినప్పుడు దురాలోచన వచ్చిన వెంటనే చూపులను ఆమెవైపు నుండి తిప్పుకోవాలి, సాధారణంగా స్త్రీని చూస్తే పురుషుని మనస్సులో చెడు ఆలోచన వచ్చే అవకాశం ఉంది. ఆ ఆలోచన ముదిరి కార్యరూపం దాల్చరాదని చూపుని మరల్చుకోమంటుంది ఇస్లాం.

స్త్రీలకన్న ముందు పురుషులకే తాకీదు చెయ్యడం జరిగింది. తరువాత స్త్రీలను, పురుషులను ప్రేరేపించే విధంగా ఉండరాదని వారు పరదా పాటించాలని ఖుర్ఆన్ చెప్పింది. ఖుర్ఆన్ వాక్యములను చూడండి.

**(ఖుర్ఆన్ 24వ సూర అన్ నూర్ 31, 32వ వాక్యం)**

స్త్రీలలో విచ్చలవిడితనం పెరగడం వలనే మానభంగాలు పెరుగుతున్నాయి అనడంలో సందేహం లేదు. అంతేకాదు మానభంగం చేసేవాడికి విధించే శిక్ష కూడా అంతంత మాత్రమే ఉండడం ఒక కారణం కూడా. మానభంగం చేసే వాడికి మహా అయితే 7 సం॥ శిక్ష వేస్తారు. అది కూడా అతడి నేరం రుజువు అయితేనే! వాడికి శిక్ష వేస్తారు. లేదంటే అదీ లేదు.

అగ్ర రాజ్యమైన అమెరికాలో మానబంగాలు గురించి చూస్తే **N.C.V.** రిపోర్టు ప్రకారం 1990 సం॥ 1756 మానభంగాల కేసులు నమోదు అయినాయి. అదే

1996లో అయితే రోజుకి 2713 మానబంగాలు జరుగుతున్నాయని F.B.I. రిపోర్టులో వెల్లడి అయింది. ఇవి లెక్కలోనికి వచ్చినవి 16% మాత్రమేనని తెలుస్తుంది. లెక్కలోనికి రానివి ఇంకా 84% కేసులు ఉన్నాయట. ఎఫ్‌బిఐ రిపోర్టు ప్రకారం చూసిన 32 సెకెండులకు ఒక స్త్రీ అత్యాచారానికి గురి అవుతుందని తెలుస్తుంది. దీనికి కారణం విచ్చలవిడితనం. అర్ధనగ్నంగా తిరగడం. తప్పుచేసినచో కఠినంగా శిక్షించక పోవడం కాదంటారా? దూరంగా ఉండమని చెప్పడమే కాదు, చెడును సమాజం నుండి దూరంగా పారద్రోలే విధానం కూడా ఇస్లాం నేర్పుతుంది. ఇస్లాంకి మరోపేరుకూడా ఉంది దీనుల్‌ఫితర్. అంటే సహజమైన మతం. అంటే సముద్రానికి అలలు సహజం. మామిడి చెట్టుకు మామిడికాయలు కాయడం సహజం. పుట్టిన ప్రతిశిశువు ముస్లిం కావడం సహజం. ఆ తరువాత పరిసరాలనుబట్టి తల్లిదండ్రులను బట్టి అతను మారుతాడు. (బుఖారి)

ముస్లిం అంటే సృష్టికర్తకు విధేయుడై జీవించడం. ముస్లిం అంటే గెడ్డం, టోపీ పెట్టుకుంటే సరిపోదు. ఇది సత్యం. పరలోకంలో ఇస్లాం తప్ప మరోకటి రక్షించలేదు.

**18 ఇస్లాం సత్యమార్గాన్ని భోధిస్తుంది. కానీ, ముస్లింలు త్రాగుబోతులుగా, మోసగాళ్ళుగా ఎందుకు అవుతున్నారు.**

يَسْـَٔلُونَكَ عَنِ ٱلْخَمْرِ وَٱلْمَيْسِرِ ۖ قُلْ فِيهِمَآ إِثْمٌ كَبِيرٌ وَمَنَٰفِعُ لِلنَّاسِ وَإِثْمُهُمَآ أَكْبَرُ مِن نَّفْعِهِمَا ۗ

మద్యపానము గురించీ, జూదము గురించి ప్రజలు నిన్ను ప్రశ్నిస్తారు. నీవు వారికి ఇలా ఉపదేశించు. "ఈ రెంటిలోనూ కీడు ఉన్నది. వాటిలో ప్రజలకు కొన్ని లాభాలు ఉన్నా, ఈ లాభాల కంటే కలిగే కీడు ఎక్కువ.

**(ఖుర్ఆన్ 2వ సూర బఖర 219వ వాక్యం)**

وَإِنْ عَاقَبْتُمْ فَعَاقِبُوا۟ بِمِثْلِ مَا عُوقِبْتُم بِهِۦ ۖ وَلَئِن صَبَرْتُمْ لَهُوَ خَيْرٌ لِّلصَّٰبِرِينَ ﴿١٢٦﴾

ఒకవేళ మీరు ప్రతీకారం చేస్తే (మీపై దౌర్జన్యం చేసేవారిపై) కేవలం మీపై దౌర్జన్యం జరిగిన మేరకే ప్రతీకారం చెయ్యండి. కాని మీరు సహనం చూపితే అది నిశ్చయంగా సహనం చూపేవారికే మంచిది.

**(ఖుర్ఆన్ 16వ సూర నహ్లె 126వ వాక్యం)**

ఎవరో కొందరు ముస్లింలు చెడుత్రోవలో ఉన్నంత మాత్రాన ఇస్లాంను నిందించడం సబబు కాదు. ఇలాంటి వాళ్ళు అన్నిచోట్ల కనబడతారు. కాని ముస్లింలపై జరిగినంత దుష్ప్రచారం మిగతావాళ్ళపై కనిపించవు. చాలా మట్టుకు ప్రచార సాధనాలు. ఇస్లాంపై అవగాహన లేక కొందరు, మరికొందరు ఇస్లాంను అణిచివెయ్యాలనే దురాలోచనతో కొన్ని ప్రచార సాధనాలు చేస్తున్న ప్రచారం ఫలితంగా ఈ అపోహలు ఉదా : 15 సం॥ అమ్మాయిని 50 సం॥ వ్యక్తి ఆమె ఇష్టంతో పెళ్ళి చేసుకుంటే అది ఓ పెద్ద వార్తలా ముందుపేజీలో పెద్ద అక్షరాలతో ప్రచురిస్తాయి కొన్ని పత్రికలు. అదే ముస్లిమేతరులు ఎవరైనా 50 సం॥ వ్యక్తి 15 సం॥ అమ్మాయిని మానభంగం (రేప్) చేస్తే దాన్ని అంతగా పట్టించుకోరు. దాన్ని మధ్య పేజీలో ఓ మూల చిన్న అక్షరాలతో వేస్తారు. ఎక్కడ విధ్వాంసకాండ సంభవించిన వెంటనే ముందు ముస్లింలనే అంటారు. తరువాత ఎంక్వైయిరీ వేస్తారు. ఇలా ముస్లింల మీద దుష్ప్రచారం జరుగుతుంది. ఎవరో కొందరు చేసిన దానికి ఇస్లాంను నిందించడం సబబు కాదు. కారు నడిపేవాడు సరిగ్గా నడపకపోతే కారు మంచిది కాదంటే ఎలా?

**19. ముస్లిమేతరులను కాఫిర్ అని ఎందుకు దూషిస్తారు?**

జ. కాఫిర్ అనే పధం అరబ్బీ భాషలోనిది. కాఫిర్ అంటే ధిక్కారి అని అర్థం వస్తుంది. దైవగ్రంథాన్ని, దైవవాక్కును దిక్కరించినవాడు అని అర్థం వస్తుంది. దైవగ్రంథాన్ని, దైవ వాక్కుని నమ్మినవాడ్ని ముస్లిం అంటారు. విశ్వాసిని ముస్లిం అంటే, అవిశ్వాసిని కాఫిర్ అంటారు. ఇది ఏమి తిట్టడం కాదు. మనలో చాలామంది ముస్లింలను తుర్కలు అంటారు. ఇది వినడానికి తిట్టులా ఉంటుంది. మొదట ముస్లింలు టర్కీ నుండి వచ్చారని భావించడం వలన తుర్కలు అనే పదం వాడుకలోకి వచ్చింది. ముస్లింలు ఎదురుపడితే మీరు సాహిబులా అని అడుగుతారు. కాని తుర్కల అని అడగరు కాని వారి గురించి మాట్లాడేటప్పుడు ఈ పదం వాడుతారు. ఏక దైవాన్ని మరియు దైవాజ్ఞలను ధిక్కరించువారిని ఖుర్‌ఆన్‌లో కాఫిర్లు (అవిశ్వాసులు) అను పదాన్ని వాడటం జరిగింది.

ఇలా ప్రకటించు, ఓ అవిశ్వాసులారా! మీరు ఆరాధించేవాటిని నేను ఆరాధించను. అలాగే నేను ఆరాధించే ఆయన్ని మీరు ఆరాధించరు. మీరు ఆరాధిస్తున్న వాటిని నేను ఆరాధించేవాణ్ణి కాను. అలాగే నేను ఆరాధించే ఆయన్ని మీరు ఆరాధించేవారు కారు. మీ ధర్మం మీది, మా ధర్మం నాదే.

**(ఖుర్‌ఆన్ 109వ సూర అల్ కాఫిరూన్1-6వ వాక్యం)**

**20. క్రైస్తవులకు ముస్లింలకు ముఖ్యమైన తేడా ఏమిటి?**

జ. ముస్లింలు ఒక్కదేవుని మాత్రమే నమ్మి, సర్వ ప్రవక్తలపై కూడా విశ్వాసముంచుదురు. ఆదాము దగ్గర నుండి ముహమ్మద్ ప్రవక్త (సల్లల్లాహు అలైవ సల్లమ్) వరకు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ ءَامِنُوا۟ بِٱللَّهِ وَرَسُولِهِۦ وَٱلْكِتَٰبِ ٱلَّذِى نَزَّلَ عَلَىٰ رَسُولِهِۦ وَٱلْكِتَٰبِ ٱلَّذِىٓ أَنزَلَ مِن قَبْلُ ۚ وَمَن يَكْفُرْ بِٱللَّهِ وَمَلَٰٓئِكَتِهِۦ وَكُتُبِهِۦ وَرُسُلِهِۦ وَٱلْيَوْمِ ٱلْءَاخِرِ فَقَدْ ضَلَّ ضَلَٰلًۢا بَعِيدًا ﴿١٣٦﴾

విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌నూ, ఆయన ప్రవక్తనూ, ఆయన తన ప్రవక్తపై అవతరింపజేసిన గ్రంథాన్నీ, ఇంకా ఆయన దీనికి పూర్వం అవతరింపజేసిన ప్రతి గ్రంథాన్నీ విశ్వసించండి. అల్లాహ్‌ను, ఆయన దూతలను, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను, అంతిమదినాన్ని తిరస్కరించినవాడు నిశ్చయంగా మార్గం తప్పి అపమార్గంలో పడి చాలాదూరం పోయాడు. **(ఖుర్‌ఆన్ 4వ సూర అన్‌నిసా 136వ వాక్యం)**

క్రైస్తవులు కూడా ప్రవక్తలందరినీ విశ్వసిస్తారు. కానీ యేసును (మసియే) దేవునిగా కొంతమంది, దేవుని కుమారునిగా కొంతమంది, ప్రవక్తగా మరి కొంతమంది విశ్వసిస్తారు.

لَقَدْ كَفَرَ ٱلَّذِينَ قَالُوٓا۟ إِنَّ ٱللَّهَ هُوَ ٱلْمَسِيحُ ٱبْنُ مَرْيَمَ ۖ وَقَالَ ٱلْمَسِيحُ يَٰبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱعْبُدُوا۟ ٱللَّهَ رَبِّى وَرَبَّكُمْ ۖ إِنَّهُۥ مَن يُشْرِكْ بِٱللَّهِ فَقَدْ حَرَّمَ ٱللَّهُ عَلَيْهِ ٱلْجَنَّةَ وَمَأْوَىٰهُ ٱلنَّارُ ۖ وَمَا لِلظَّٰلِمِينَ مِنْ أَنصَارٍ ﴿٧٢﴾

మర్యమ్ కుమారుడైన మసీహ్‌యే అల్లాహ్ అని అన్నవారు నిశ్చయముగా అవిశ్వాసానికి పాల్పడినట్లే. వాస్తవానికి మసీహ్ ఇలా అన్నాడు. ఇశ్రాయిలూ వంశీయులారా! అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఆయన నాకు ప్రభువే, మీకు ప్రభువే. ఇతరులను అల్లాహ్‌కు భాగస్వాములుగా చేసేవారికి అల్లాహ్ స్వర్గాన్ని నిషిద్ధం చేశాడు. వారి నివాసం నరకం. అటువంటి దుర్మార్గులకు సహాయం అందించే వాడెవడూ లేడు. **(ఖుర్‌ఆన్ 5వ సూర అల్ మాయిద 72వ వాక్యం)**

కానీ ముహమ్మద్ ప్రవక్తను విశ్వసించరు. ఇదే ముఖ్యమైన తేడా. వాస్తవానికి మసీహ్ (యేసు) ఇలా అన్నాడు. ఇస్రాయీలూ వంశీయులారా! అల్లాహ్‌కు దాస్యం చేయండి. ఆయన నాకూ ప్రభువే మీకూ ప్రభువే.

ఆయన (ముహమ్మద్) పై అవతరించిన గ్రంథం (ఖుర్‌ఆన్)ను కూడా విశ్వసించరు. వారి గ్రంథాలలో (బైబిల్)లో ముహమ్మద్ గూర్చి వచనాలు ఉన్నాయి.

ఉదా : ఆ ప్రవక్త, ఆదరణ కర్త, సత్య స్వరూపి మొదలగునవి.

## విశ్వప్రవక్త ముహమ్మద్ (స.అ.స) గారి కాలజ్ఞానం

ఆయన (అల్లాహ్) అతీంద్రియ జ్ఞానం కలవాడు, తన అతీంద్రయ విషయాలను తాను ఎంచుకున్న ప్రవక్తకు తప్ప మరెవ్వరికీ తెలియజేయడు.

**(ఖుర్ఆన్ 72వ సూర్ అల్ జిన్న్ 26 వ వాక్యం)**

విశ్వ ప్రవక్త (స.అ.స) వారికి 40 సంవత్సరముల వయస్సులో ప్రవక్త పదవి లభించింది. అప్పటి ప్రజలు ఈయనకు చదవడం వ్రాయడం రాని వాడు, ప్రవక్తనని చాటుతున్నాడు. అయితే పూర్వ గ్రంథాలలో ఉన్న విషయాలను అడిగినచో దానికి జవాబు ఏ విధంగా లభస్తుందని అడిగేవారు.

**వాటిలో కొన్నింటిని చూద్దాం:** **(బూత కాలం)**

ప్రవక్తా! ఇది అగోచర సమాచారములు. వాటిని మేము నీకు వహీ ద్వారా తెలుపుతున్నాము. ఇంతకు పూర్వం నీవుగానీ నీ జాతి వారు గానీ వాటిని ఎరుగరు.

**1. గృహం (కహఫ్) వారి విషయం మీకు తెలుసా?**

మేము వారి అసలు గాధను నీకు వినిపిస్తున్నాము. వారు తమ ప్రభువును విశ్వసించిన కొందరు యువకులు. మేము వారికి సన్మార్గంపై నడపటంలో అభివృద్ధిని ప్రసాదించాము. వారు లేచి ఈ ప్రకటన చేసినప్పుడు మేము వారి హృదయాలకు ధృఢత్వాన్ని కలుగజేశాము; "ఆకాశాలకూ, భూమికీ ప్రభువైన వాడే మా ప్రభువు. మేము ఆయనను త్రోసిరాజని మరొకణ్ణి దేవుడుగా చేసుకొని వేడుకోము. ఒకవేళ మేము అలా చేస్తే, పూర్తిగా అనుచితమైన దానిని చేసిన వారమవుతాము." (తరువాత వారు పరస్పరం ఇలా అనుకున్నారు) మన జాతివారైన మీరు విశ్వ ప్రభువును కాదని ఇతర దైవాలను సృష్టించుకున్నారు. ఈ దైవాలు ఆరాధ్యులని స్పష్టమైన ప్రమాణాన్ని దేన్నయినా ఈ ప్రజలు ఎందుకు తీసుకురారు? అల్లాహ్ విషయంలో అభూత కల్పనకు పాల్పడే వాడిని మించిన దుర్మార్గుడెవడు? ఇప్పుడు వీరు వారితోను, అల్లాహ్‌ను కాదని వారు ఆరాదించే దేవుళ్ళతోను సంబంధాలను త్రెంచుకున్నారు. కనుక, ఇక పదండి. ఫలానా గుహలో ప్రవేశించి ఆశ్రయం పొందండి. మీ ప్రభువు మీపై తన కారుణ్యఛాయను విస్తరింపజేస్తాడు, మీ కార్యసిద్ధికై సకల సామాగ్రిని సమకూరుస్తాడు. (18:13-16)

**2. మోషే మరియు ఫిరౌన్ వారి గూర్చి**

మేము వారికి పూర్వం, ఫిరౌన్ జాతి వారిని ఇటు వంటి పరీక్షకే గురిచేశాము. వారి వద్దకు ఎంతో మర్యాదస్తుడైన ఒక ప్రవక్త వచ్చాడు. అతను ఇలా అన్నాడు, "అల్లాహ్ సేవకులను నాకు అప్పగించండి. నేను మీ కొరకు వచ్చిన ఒక నమ్మకస్తుడనైన ప్రవక్తను. అల్లాహ్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయకండి. నేను మీయందు (నా నియమాకానికి సంబంధించిన) స్పష్టమైన ప్రమాణాన్ని ఉంచుతున్నాను. మీరు నా మీద దాడి చేయకుండా నేను నా ప్రభువు యొక్క శరణుపొందాను. ఒకవేళ మీరు నా మాట నమ్మకపోతే సరే, నా జోలికి మట్టుకురాకండి". చివరకు అతను, "ఈ ప్రజలు అపరాధులు" అని తన ప్రభువుతో చెప్పుకున్నాడు. (ఇలా జవాబు ఇవ్వబడింది), "మంచిది, రాత్రికి రాత్రే నా సేవకులను తీసుకుని బయలుదేరు. మిమ్మల్ని వెంటాడటం జరుగుతుంది. సముద్రాన్ని అది ఉన్న

స్థితిలోనే విడిచిపెట్టు. అప్పుడు ఈ సైన్యం అంతా మునిగిపోతుంది". వారు ఎన్ని తోటలను, ఎన్ని నీటిబుగ్గలను, ఎన్ని పొలాలను, ఎన్ని అందమైన సౌధాలను వదలివెళ్లారు! వారు అనుభవిస్తూ ఉన్న విలాస వస్తువులను ఎన్నో వారివెనకనే ఉండిపోయాయి! ఇలా జరిగింది వారి ముగింపు. మేము ఇతరులను ఈ వస్తువులకు వారసులుగా చేశాము. తరువాత వారి కొరకు ఆకాశమూ విలపించలేదు. భూమీ విలపించలేదు. వారికి కొద్దిపాటి వ్యవధి కూడా ఇవ్వబడలేదు. **(ఖుర్ఆన్ 44వ సూర్ అల్ దుఖాన్ 17-29 వ వాక్యం)**

### 3. ఆత్మ గురించి మీ ఉద్దేశ్యం ఏమిటి?

ఈ ప్రజలు నిన్ను ఆత్మను గురించి ప్రశ్నిస్తున్నారు. ఇలా అను: "ఈ ఆత్మ నా ప్రభువు ఆజ్ఞానుసారం వస్తుంది. కాని మీకు ప్రసాదించబడిన జ్ఞానం బహుస్వల్పమైనది. **(ఖుర్ఆన్ 17వ సూర బనీ ఇస్రాయీల్ 85 వ వాక్యం)**

### 4. యేసు (ఈసా) గూర్చి మీ ఉద్దేశ్య మేమిటి?

ప్రవక్తా! ఈ గ్రంథంలో, మర్యమ్ తన వారినుండి వేరై పోయి, తూర్పు దిక్కున ఏకాంతంగా కూర్చుండి, వారికి చాటుగా తెర కట్టుకుని ఉండిపోయినప్పటి వృత్తాంతాన్ని ప్రస్తావించు. ఈ స్థితిలో మేము ఆమె వద్దకు మా 'ఆత్మ'ను (అంటే దూతను) పంపాము. అప్పుడు అతడు ఆమె ముందు పరిపూర్ణమైన మానవాకారంలో ప్రత్యక్షమయ్యాడు. వెంటనే మర్యమ్ ఇలా పలికింది, "నీవు దైవభీతి గల మనిషివే అయితే, నేను నీ బారినుండి రక్షించవలసినదిగా దయామయుడైన దేవుని శరణు కోరుకుంటున్నాను." అతను "నేను నీ ప్రభువు దూతను మాత్రమే. నీకు ఒక పరిశుద్ధ పుత్రుణ్ణి ఇచ్చేందుకు పంపబడ్డాను" అని చెప్పాడు. తరువాత ఆమె ఆ బాలుణ్ణి తీసుకొని తన జాతి వారి వద్దకు వచ్చింది. ప్రజలు ఇలా అన్నారు. "మర్యమ్! నీవు పెద్ద పాపమే చేశావు. ఓ హారూన్ సోదరీ! నీ తండ్రి కూడా చెడ్డ మనిషికాడే; నీ తల్లి కూడా నీతి బాహ్యమైన నడతగల స్త్రీ కాదే!" మర్యమ్ బాలునివైపు సైగజేసి చూపింది. దానికి ప్రజలు, "ఉయ్యాలలోని ఈ పసిపిల్లవానితో మేము ఏం మాట్లాడము?" అని అన్నారు. పిల్లవాడు ఇలా పలికాడు, "నేను అల్లాహ్ దాసుణ్ణి. ఆయన నాకు గ్రంథాన్ని ఇచ్చాడు, నన్ను ప్రవక్తగా నియమించాడు. నేను ఎక్కడున్నా సరే, ఆయన నన్ను శుభవంతునిగా చేశాడు. నేను జీవించి ఉన్నంతకాలం నమాజును, జకాతును పాటించు అని ఆజ్ఞాపించాడు. నా తల్లి హక్కును నెరవేర్చువానిగా నన్ను చేశాడు. నన్ను దౌర్జన్యపరునిగాను, పాషాణ హృదయుని గాను చేయలేదు. నేను పుట్టిన రోజునా, నేను మరణించే రోజునా, బ్రతికింపబడి లేపబడే రోజునా నాకు శాంతి కలుగుతుంది." ఇతనే మర్యమ్ కుమారుడు ఈసా; ఇదే అతనికి సంబంధించిన అసలు నిజం. దానిని గురించి ప్రజలు సందేహిస్తున్నారు. ఎవరినైనా తన కుమారుడుగా చేసుకోవడం అనేది అల్లాహ్‌కు తగిన పద్ధతికాదు. ఆయన పరమ పవిత్రుడు. ఏ విషయాన్ని గురించియైనా ఆయన నిర్ణం తీసుకుంటే, "అయిపో" అని ఆజ్ఞాపిస్తాడు. అంతే అది అయిపోతుంది. (ఈసా ఇలా ప్రకటించాడు) "నాకూ, మీకూ ప్రభువు అల్లాహ్‌యే. కనుక మీరు ఆయనకే దాస్యం చేయండి. ఇదే ఋజుమార్గం." **(ఖుర్ఆన్ 19వ సూర మర్యమ్ 27-36 వ వాక్యం)**

**వాఖ్యానం :** చదవడం, వ్రాయడం రాలేనటువంటి ప్రవక్త ఎవరి దగ్గర కూడా పూర్వగ్రంథాల యొక్క జ్ఞానం తెలుసుకొనుటకు వెళ్లలేదు. మరియు అరేబియా దేశమంతటా అన్యాయాలు, అక్రమాలు హత్యలు, హత్యాచారాలు, దొంగతనాలు, త్రాగుడు,

విగ్రహారాధకులు కలిగియున్న అరేబియా దేశంలో జన్మించిన ఒక సాధారణ వ్యక్తి. బాల్యంలోనే తల్లి, తండ్రి చనిపోయిన అనాధుడు. బాబాయి మరియు తాతగారి చేతుల మీదగా పెద్దవాడై వ్యాపార రీత్యా పల్లెపల్లే తిరిగి యవ్వన దిశ వరకు ఎటువంటి పదవి, పెద్దరికం, ధన సంపాదన లేనటువంటి ఆయనకు అల్లాహ్ సుబ్‌హానహుతాల తన కరుణఛాయల్లో ఈ వ్యక్తిని ఎన్నుకొని ఒక ప్రవక్త పదవిని ప్రసాదించాడు. ఆయనే విశ్వ ప్రవక్త సల్లాలాహు అలైహివ సల్లమ్.

పై విషయములు దైవ వాణి (వహి) ద్వారా తెలపడం జరిగింది. ఆ కాలమున ప్రపంచంలో గల పెద్ద పెద్ద మహా నాయకులు (సర్దారులు) విద్వాంశులు, పెద్ద ధనవంతులు, మహా పండితులు కూడా ఆశ్చర్యం వెలిబుచ్చిరి.

తను జీవించి ఉన్న కాలములో జరుగుతున్న విషయాలను గూర్చి తెలిపిరి (వర్తమాన కాలం)

1. ఫలాన స్త్రీ దగ్గర మా యొక్క సమాచార పత్రం (లేఖ) ఉంది.
2. ఫలాన వ్యక్తి విశ్వాసిగానే మనతో ఉన్నాడు గాని, అతని చావు స్వయంగా ఆత్మహత్య చేసుకుంటాడు.
3. ఫలాన యుద్ధం (బదర్) ఈవిధంగా జరుగుతుంది. మొదలగునవి.

## ప్రళయానికి ముందు సంభవించు కొన్ని విషయాలు (భవిష్యత్ కాలం)

1. ప్రళయం రాకకు, నా రాకకు మధ్య దూరం మధ్య వ్రేలు, చూపుడు వ్రేలుతో కలిపి చూపించి వీటి మధ్య ఉన్న దూరమే అని ప్రవక్తవారు అన్నారు. **(బుఖారి)**

   (మొదటి సూచన ప్రవక్త ముహమ్మద్ (స.అ.స) వారు చనిపోవుట)

2. ప్రళయం సమీపించినప్పుడు ఈ సూచనలు కనబడును. కాలం కుదించబడును. సంవత్సరం నెల వలె, నెల వారం వలె, వారం ఒకరోజు వలె, ఒకరోజు గంట వలె. ఒక గంట ఒక అగ్ని కాంతి ప్రకాశించుచూ పోవునట్లుగా **(తిర్మజి)**

   (ప్రస్తుత కాలం సంవత్సరం దాటిన వెంటనే నెల వలె కనబడుచున్నది. నెల రోజు వలె గడచిపోవుచున్నది. సమయం ఎంత వేగంగా గడచిపోతుందో మనం చూస్తున్నాము. మనిషికి ఈనాడు రోజుకి 24 గంటలు ఉన్నా సరిపోవడం లేదు.

3. ప్రళయానికి ముందు ఫిత్నా (ఉపద్రవం) అబద్ధం పలికేవారు అధికులగుదురు. బజార్లు దగ్గర దగ్గర ఏర్పాటు చేయబడును. **(అహమ్మద్, ఖయామత్‌కే నిషానియా పేజి నెం. 208)** (బజార్లు దగ్గర దగ్గరగా ఏర్పాటు చేయడం అంటే వ్యాపారంలో విపరీతమైన పోటీ పెరగడం ఇది నిజం కాదా? ప్రవక్త ముహమ్మద్ (స.అ.స.) 1400 సం॥ల పూర్వం చెప్పిన మాటలు ఈ రోజు మనముందు జరుగుచున్నవి.)

4 బానిస స్త్రీ తన యజమానినికంటుంది. మరియు ఒంటిమీద బట్టలు లేనివారు, చెప్పులు ధరించనివారు రాజ్యములు ఏలుదురు. **(బుఖారి)**

   (ఎంతో బీదరికంలో పుట్టి గొప్ప గొప్ప పదవులను అధిష్టించినవారిని మనం ఈనాడు చూస్తున్నాము కదా!)

5. వర్షాలు కురుస్తాయిగాని పంటలు పండవు. (ముస్లిం)
(ప్రస్తుత కాలంలో వర్షం చాలీ చాలినట్లుగా పడుతున్నది. పంటకు సరిపోవడం లేదు. ఒకొక్కసారి తుఫాన్ వస్తుంది. దాని వల్ల పంటలు చేతికి అందకుండా కొట్టుకొని పోతున్నాయి కదా!)

6. విద్య ఎత్తుకొనబడును. అజ్ఞానము అధికమగును, వ్యభిచారము, సారాయి (మత్తుపానీయాలు), పురుషులు తక్కువ, స్త్రీలు అధికులు. 50 స్త్రీలకు ఒక్క పురుషుడు వారి పోషకుడుగా నిర్ణయించబడును. (బుఖారి ముస్లిం)

(విద్య ఎత్తుకొనబడును అంటే విద్యను జ్ఞానము పెంపొందించేదిగాకుండా దానిని వ్యాపారంగా చూస్తారు. దానివలన అజ్ఞానం పెరిగిపోయింది. ఈనాడు వ్యభిచారం సర్వసాధారణమై పోయింది. మత్తుపానీయాలు సేవించడం ఫ్యాషన్‌గా మారిపోయింది. ప్రపంచ వ్యాప్తంగా స్త్రీలు అధికమైపోతున్నారు. ఇవన్నీ మనకళ్లకు కనబడుతున్న పచ్చి నిజాలు కావంటారా?)

7. మత్తు పానీయములు యొక్క దాని పేరు మార్చి హలాల్ ధర్మసమ్మతం చేసుకుందురు. (ఇబ్నెమాజా)

(మత్తు పదార్థముల యొక్క శాస్త్రీయ నామాన్ని పెట్టి తినుబండారములలో, మందులలో ఉపయోగించుచున్నారు.)

8. మహా ప్రవక్త (స.అ.స.) ఈ విధంగా బోధించిరి. మంచి పనులు త్వరగా చేసుకోండి ఎందుకనగా అల్లకల్లోలాలు సృష్టించబడును. ఆ సమయంలో ఉదయం విశ్వాసిగా ఉండును. సాయంత్రం అవిశ్వాసి (కాఫిర్)గా మారును. (ముస్లిం)
(నానా విధములు పరీక్షలకు గురిఅగుచూ చేయలేని పనులు చేయుటకు ముస్లిం సిద్ధమగును)

9. డబ్బు ఎక్కువగా కలుగును. మరియు హత్యాకాండలు ఎక్కువగును.
(బుఖారి ముస్లిం, అబుదావూద్ ఇబ్నెమాజ)

(ధన సంపాదనలో పడి హత్యలు, హత్యాకాండలు చేయడానికి వెనుకాడరు)

10. ఇలాంటి వారు జన్మిస్తారు. వ్యభిచారం పట్టు వస్త్రములు, మత్తు పదార్థములు, పాటలను హలాల్ (ధర్మసమ్మతం) చేసుకొనుదురు.

(ఇస్లాంలో పట్టు వస్త్రములు పురుషునికి హరామ్ (నిషేదం) కాని దాన్ని హలాల్ చేసుకొని తొడుగుచున్నారు. 18 సంవత్సరముల బాలిక బాలురు విచ్చలవిడిగా తిరగవచ్చు. చట్టపరంగా ఎటువంటి అభ్యంతరము లేదు. తమ తల్లిదండ్రులైనా సరే వారికి ఆపడానికి వీలులేదు. వేశ్యలకు లైసెన్సు కూడా జారీ చేస్తున్నారు).

11. ఒక కాలం రాబోతున్నది. హత్య చేసేవాడు తను ఎందుకు హత్య చేస్తున్నాడో, అతనికే తెలియదు. హతుడికి నన్ను వీడు ఎందుకు చంపుతున్నాడో అర్థం కాదు. (ముస్లిం)

(ప్రస్తుత కాలంలో హత్య హత్యలు, హత్యాకాండలు ఏవిధంగా జరుగుతున్నాయో మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము. 1400ల సం॥ క్రితం ముహమ్మద్ (స.అ.స. వారు చెప్పిన మాటలలో ఎంత నిజం ఉందో అర్థమగుచున్నది. వీటిన బట్టి ప్రళయం అతి సమీపంగా వున్నదని నమ్ముతున్నారా? లేదా?)

12. సిగ్గు, లజ్జ లేకుండా పోవును. క్షమాగుణం లేకుండా పోవును. సత్యవంతులను అసత్యవంతులుగా, అసత్యవంతులను సత్యవంతులుగా పరిగణించబడుదురు. ఇరుగుపొరుగువారు విరోధులుగా మారును. (ముస్నద్ అహ్మద్, ఖియామత్ కి నిసానియా పేజ నెం. 128)

(పాత రోజుల వారికి, ఈనాటి తరంవారికి తేడా చూస్తే ఈనాటి వారికి సిగ్గు, లజ్జలు ఉన్నాయంటారా? నిజం చెబితే నమ్మేవారు ఎంతమంది. అసత్యపు మాటలకు మోసపోయేవారి సంఖ్య ఎంతో అధికంగా కనపడ్తుంది. ఇది నిజం కాదంటారా!)

13. ధరణిపై అల్లాహ్ యొక్క నామస్మరణం చేసేవారు ఒక్కడూ కూడా లేనప్పుడు ప్రళయం సంభవించును. (ముస్లిం)

(అవిశ్వాసులపై ప్రళయం సంభవించును)

14. ప్రళయానికి ముందు తప్పనిసరిగా ఈ సూచనలు కనపడును. వ్యాపారంలో అబద్ధం, అసత్యపు రచయితలు, బంధుత్వ తెగతెంపులు చేయువారు పుట్టెదరు. (అహ్మద్, హాకీమ్, ఖయామత్ కి నిసానియా పేజ నెం. 146)

(వ్యాపారంలో మోసం, అబద్ధము సర్వసాధారణమై పోయాయి. జరిగేదొకటి పత్రికలలో, పుస్తకాల్లో వ్రాసేది మరొకటి, ముత్యాల హారం యొక్క దారము తెగినచో ముత్యాలు ఏవిధంగా రాలిపోవునో, అవిధంగా బంధుత్వం తెగిపోవు చున్నది.)

15. అబద్దపు సాక్ష్యులను ప్రవేశపెట్టెదరు. నిజమైన సాక్ష్యులను దాచిపెట్టదరు. (అహ్మద్, ఖయామత్ కి నిసానియా పేజ నెం. 151)

(న్యాయస్థానాలలో డబ్బు ఇచ్చి అబ్బదపు సాక్ష్యాలను ప్రవేశపెట్టుట వలన నేరస్థుడు శిక్ష నుండి తప్పించుకొని తిరుగుచున్నాడు).

16. తప్పనిసరిగా ఈ కాలం రాబోవుచున్నది. మనిషి తన సంపాదన హలాల్ (ధర్మసమ్మతం లేక హరామా!) అన్న ఆలోచన కూడా చేయకుండా సంపాదిస్తాడు. (బుఖారి, మసాయి)

(ప్రస్తుతం ప్రజలు ఏదో విధంగా డబ్బు సంపాదించడమే తమ లక్ష్యంగా పెట్టుకొను చున్నారు. ఆ డబ్బు ధర్మసమ్మతమా, అధర్మ సమ్మతమా అని కనీసం ఆలోచించడం లేదు.)

17. ప్రళయానికి ముందు ప్రత్యేకమైనవారికే సలామ్ (శుభం) అని చెప్పుదురు. మరియు వ్యాపారంలో స్త్రీలను పెట్టుదురు. (అహ్మద్, ఖయామత్‌కి నిసానియా పేజ నెం. 167)
(బీదవారికి సలామ్ చేయుటలేదు. డబ్బున్నవారికే, హోదా కలిగినవారికే సలామ్ చేయుట మనము చూస్తున్నాము. వ్యాపారాలు పెంచుకోవడం స్త్రీలను ఎంతగా వాడుకుంటున్నారో మనం చూస్తూనే ఉన్నాం.)

18. ప్రళయానికి ముందు భూకంపాలు అధికంగా వచ్చును. (బుఖారి)
(పత్రికలలో టీ.వీ.ల ద్వారా మనం చూస్తే ఉన్నాము ప్రతీ వారానికి ఏదో ఒక ప్రదేశంలో భూకంపాలు, జలప్రళయం, అగ్ని పర్వతాలు బ్రద్దలగుట మరియు చెట్ల రాపిడివల్ల మంటలు రేగుట మనం చూస్తూనే ఉన్నాము.)

19. హఠన్మరణాలు అధికమగును.
(మజ్‌మాఉజ్ జవాఏద్, ఖియామత్‌కె నిసానియా పేజ నెం. 183)

(ప్రస్తుత కాలంలో మనం చూస్తున్నాము, వయస్సుతో నిమిత్తం లేకుండా హార్ట్ ఎటాక్ (గుండెపోటు)తో అత్యధికులు మరణిస్తున్నారు) మనకు తెలియలేని అనేక జబ్బుల రూపంలో హఠన్మరణాలు సర్వసాధారణమైపోయాయి.

21. ఒక వ్యక్తి ప్రవక్త (స.అ.స.) వారిని ప్రళయం ఎప్పుడు సంభవించునని ప్రశ్నించెను. సమాధానంగా ప్రవక్త (స.అ.స.) వారు ఈ విదంగా బోధించిరి.

ఎపుడైతే భద్రపరచవలసిన వ్యక్తులే దోచుకునేవారుగా మారినపుడు, సమస్యలు వచ్చినప్పుడు అవివేకులు దాని పరిష్కారంనకు సూచనలు ఇచ్చే సమయం వచ్చినచో ప్రళయం సమీపించినట్లే) **(బుఖారి)**

22. దజ్జాల్ రాకకు కొన్ని సంవత్సరముల ముందు ఇవి సంభవించును. అసత్య వాదులు మోసగాళ్ళు అధికులగును, సత్యవంతులను హింసించెదరు, అసత్యవాదులను ప్రజలు బలపరచుదురు) అసత్యవాదులను సత్యవాదులని, సత్యవాదులను అసత్యవాదులని మరియు న్యాయ నిర్ణయాలను అసత్యవాదుల చేతులకు అప్పగించబడును.

**(ఇబ్నెమాజా)**

పై చెప్పబడిన విషయమలు 1400 సం॥ల పూర్వపు ప్రజలు ఇలా అగుట అసాధ్యమని భావించిరి. కాని ప్రవక్త (స.అ.స.) వారు ఈ విషయములు నిస్సందేహముగా జరుగునని వక్కాణించి చెప్పారు. అవి ఈరోజు మనకు కంటి ఎదురుగా జరుగుచున్నవి. ఆయన ఏది చెప్పినా తనంతన తాను ఏదియూ పలకక దైవవాణి ద్వారా సంభవింపబోవు అనేక విషయములను తెలియపర్చిరి. అప్పటి కాలంలో ఎలాంటి శాస్త్రీయ పరిజ్ఞానం ఉండేదో 1400 సం॥ల క్రితం వెనక్కి వెళ్ళినచో అర్థమగును. ఈయన ఆ కాలంలో ఈలాంటి విషయాలు తెలిపినందులకైనా నిజమైన విశ్వప్రవక్త అని నమ్మక తప్పదు. ప్రళయానికి ముందు జరగబోవు మరికొన్ని విషయాలు చూద్దాం.

హజ్రత్ ఉజైఫా (రజి) కథనం ప్రకారం మహా ప్రవక్త ముహమ్మద్ (స.అ.స.) వారు ఈ విధంగా బోధించిరి. 10 ముఖ్యమైన సంఘటను జరగనంత వరకు ప్రళయం సంభవించదు. 1. పొగ 2, దజ్జాల్ 3. భూమి నుండి ఒక జంతువు బయల్పడును. 4. సూర్యుడు పడమర నుండి ఉదయించును. 5. ఈసా (అలై) రెండవ రాకడ. 6. యాజూజ్ మాజూజ్ 7. అరేబియాలో మూడు ప్రదేశములలో 8. ఉత్తర, 9. దక్షణ కొంతమంది భూమిలో కూరుకుపోవును. 10. యమన్ నుండి ఒక అగ్ని వచ్చును. ప్రజలందరిని ఒక చోట సమావేశపరచును.

పొగ : ప్రళాయానికి ముందు పొగ ఆకాశమంతయూ 40 రోజుల పొగ కమ్ముకొనును. మహా ప్రవక్త (స.అ.స) వారు తెలిపిరి. మూడు విషయమలు రాకముందు ఏక దేవుడ్ని విశ్వశించినవారే నిజమైన విశ్వాసులు. ఆతరువాత విశ్వసించినా సరే ఎటువంటి ప్రయోజనము ఉండదు. 1. సూర్యుడు ఉత్తరము నుండి రావడం 2. పొగ వచ్చుట 3. భూమి నుండి ఒక జంతువు బయల్పడుట **(ముస్లిం తిర్మజి)**

దజ్జాల్ : ప్రళయానికి ముందు 30 మంది అసత్యవాదులు వచ్చుదురు. చివరిగా దజ్జాల్ ఆయన ఎత్తుగా గోధుమ వర్ణంకలిగిన తెలుపు రంగు ఉంగరాల జుత్తు ఒంటి కన్నువాడు.

ఒక కన్ను దానిమ్మపండు వలె ఎరుపురంగు కలిగి ఉండును. రెండు కనుబొమ్మల మధ్య కాఫిర్ అని వ్రాసి ఉండును. ఈయన అద్భుత క్రియలు చేయును. భూమి నుండి బంగారం వెండి వెలికి తీయును. చనిపోయిన వారిని లేపును. వర్షం కురిపించును. తనే దేవుడని విశ్వశించమని చెప్పును. అలా విశ్వసించినవారికి తన స్వర్గములో తీసుకొనును. విశ్వశించనివారిని తన నరకంలో పడవేయును. వాస్తవానికి వీడు కల్పించిన స్వర్గం నరకం. నరకమన్నది స్వర్గం. (బుఖారి, ముస్లిం, అబూదావూద్. తిర్మజి)

భూమి నుండి ఒక జంతువు బయటకు వచ్చును.

ఈ జంతువు విశ్వాసులను, అవిశ్వాసులను వేరుపరచును.

సూర్యుడు పడమర నుంచి ఉదయించును : ప్రళయానికి ముందు మొట్టమొదటి ఎప్పుడైతే సూర్యుడు పడమర నుండి ఉదయించునో వెంటనే ఒక జంతువు భూమి నుండి బయటకు వచ్చును. (ముస్లిం, అబుదావూద్, ఇబ్నెమాజా)

ఈసా రెండవ రాక : భూమిపై దైవ ధర్మమును స్థాపించుటకు వచ్చును. ఆయన 40 సంవత్సరములు రాజ్యమేలుదురు. దజ్జాల్‌ను కూడా ఆయనే హతమారుస్తారు.

యాజూజ్ మజూజ్ : యాజూజ్ మాజూజ్ అనువారు ఒక జాతి మనుష్యులు వారి ముఖాలు వెడల్పుగా కళ్ళు చిన్నవిగా, తల వెంట్రుకలు బంగారంలాగ తెల్లగా మెరుస్తాయి. వీరు జుల్‌ఖర్‌నైన్ అను రాజు కాలంలో ఒక ప్రాంతానికి చెందినవారు. వీరు ఆ ప్రాంతంలో ఉపద్రవాలు సృష్టించుచుండేవారు. ఆ రాజును ఆ ప్రాంతం వారు ఈవిధంగా విన్నవించుకున్నారు. యాజూజ్ మాజూజ్ మాకు పెట్టే బాధలను తట్టుకోలేక పోవుచున్నాము. వారికి మాకు ఒక గోడ నిర్మించమనిరి. వెంటనే ఆ రాజు లోహముతో కరిగించి దానిపై రాగి గోడను నిర్మించెను. దాని నుండి వారు బయకు రాలేరు. దేవుని ఆజ్ఞ వల్ల ప్రళయానికి ముందు వారు కొండల గుట్టలుదాటి బయటకు వస్తారు. అల్లకల్లోలాలు సృష్టిస్తారు. వారు ఏ నది ప్రక్కనుండి ప్రయాణం చేసినా ఆ నది నీరు పూర్తిగా త్రాగేస్తారు. (ఇబ్నెమాజా)

అరేబియా ప్రాంతములలో మూడు ప్రదేశములలో కూరుకుపోవును : వారిలో కొంతమంది విశ్వాసులు కూడా ఉందురు. వారి విశ్వాసాన్ని బట్టి ప్రళయం రోజు న్యాయ నిర్ణయం జరుగును. మంచి సంకల్పంతో చనిపోయిన వారికి స్వర్గం చెడు సంకల్పంతో చనిపోయిన వారికి నరకం లభించును. (ముస్లిం, అబుదావూద్)

యమన్ నుండి ఒక అగ్ని వచ్చును: ఈ అగ్ని వేడికి ప్రజలు తట్టుకోలేక ప్రజలందరూ పరుగులుపెడుతూ ఒకచోట చేరుదురు.

పై సంఘటనలు తప్పనిసరిగా జరుగును. నిస్సందేహముగా ప్రళయం అతి సమీపంలోనే ఉన్నది. ప్రియ పాఠకులారా! జ్ఞాన నేత్రములు తెరవండి. సర్వసృష్టికర్త ఒక్కడేనని ముహమ్మద్ (స.అ.స.) చిట్టచివరి ప్రవక్త అని విశ్వసించి సత్కర్మలు చేసుకుంటూ పై తెలుపబడిన విషయాలపై పూర్తి విశ్వాసంతో ఉండాలని అల్లాహ్ సుభహానహు తాలతో ప్రార్థన చేస్తూ ముగించుచున్నాను.

**వాఆఖీ రుద్దావాన అనిల్ హందులిల్లాహి రబ్బిల్ ఆలమీన్**